కవితిలక గ్రంథమాల — పంచమ కుసుమము

# హంసవిజయ నాటకము

విద్వత్కవితిలక
కాంచనపల్లి కనకాంబా ప్రణీతము
[మైలాపుర మేరీరాణీ కళాశాలాంధ్రోపన్యాసకురాలు]

ప్రకాశకులు:
కవితిలక గ్రంథమాలా కార్యస్థానమువారు
71, లాయిడ్సురోడ్డు, కథీడ్రల్ పోస్టు, మద్రాసు

శాఖలు :—తిరుపతి - బెజవాడ

1935



[వెల రు. 1-0-0

# అంకితము

ఉ. వాసనలేక యోగినివి. వైరము లేక మహానుభావవున్
నీసరియంచు నెంచఁదగునే! కనకమ్మల నామమాత్రనే
వాసనలేని దోసమును వైరము గల్గిన గొప్పదోసమున్
మూసెను మూడువ్యక్తుల విముక్తినిఁ బూర్ణత నీకొసంగఁగా
నీసరి నీవ యౌదు జననీ ధర నీకొక సామ్య ముండునే
భూసురభక్తిపాండితియుబోధమహత్త్వముదివ్యసత్త్వమున్
వాసిగ వన్నెకెక్కిన ప్రపత్తియు ధర్మపరోక్తి యెందునన్
భాసిలునట్టికావ్యము కృపామతిఁ గూర్పుము నీవు నేర్పుమై
ఆసజనించె నాహృదయమందునఁ దత్కృతినాథు శ్రీధవుం
జేసినఁ జాలు నంచుఁ దనచేతులు మోడ్చి నయంబు మీఱఁగా
భూసురుఁ డొక్కరుం డడుగఁ బూనితి నీకృతి కెంతయున్ హరీ
నీసిరి నీవు నీకృతికి నిత్యము తోడ్పడి నీదుభక్తులే
భూసురుఁ డీవు నైక్యమును బొందుట నిక్కము చేయ నీ కృతిన్
జేసి పరిగ్రహింపు నతిఁ జేసెద నీకుఁ బరాత్పరా యికే
జేసెడి దేమి? యాతనికిఁ జెచ్చెరనిచ్చెడి దేమి! సర్వమున్
జేసి రమించు సత్కృతికి నీకు నమస్కృతి యో శ్రియఃపతీ.


మన్నారాయణచర
ణౌ మమతారోహితహృదయనళినవసంతౌ
రామ! శరణంప్రపద్యే
భామానందప్రదౌ విభూసుమహాంతౌ!

# అవతారిక

హంసవిజయనాటకము పూర్తికాఁగానే వ్రాఁతప్రతిలో నున్న పుడే దానిని లోకమందు వెలయింపఁజేయ శ్రీయుత సర్ అల్లాడి కృష్ణస్వామిఅయ్యరుగారు సర్ రాధాకృష్ణయ్యగారిపేర నొక జాబు వ్రాసి పంపియుండిరి.

రాధాకృష్ణబుధుండును, గ్రంథమును సమగ్రముగఁ జదివి తన సంతోషమును శ్రీకృష్ణస్వామి అయ్యర్ గారికిఁ దెలుపుచు నీ నాటకంబున కుపోద్ఘాతమును దాను వ్రాయుటకన్న శ్రీజయపూరు మహారాజు విక్రమదేవవర్మగారు వ్రాయుట సర్వవిధములఁ దగియుండు నని నాకు వ్రాసిరి.

అననుభూతపూర్వ మగు రాజాదరణము నాకు దుర్లభంబగు నని యెంచి నేను శ్రీరాధాకృష్ణయ్యగారికి వ్రాసితిని. ఈపద్యములు స్థలాంతరమున ముద్రింపఁబడినవి.

ఆపద్యములఁ దిలకించి "ఆంధ్రభాషయందు దసమాన పాండిత్యము గల్గియుండుటయే కాక యార్యవిజ్ఞానమును బోధించు నుదార స్వభావము గల శ్రీవిక్రమదేవవర్మ మహారాజుగారే సర్వవిధముల హంసవిజయమున కుపోద్ఘాతము వ్రాయఁదగుదు రని నేను నమ్ముచున్నాను." అని శ్రీరాధాకృష్ణయ్యగారు బదులు వ్రాసిరి.

నేను బరమానందము నొంది యదియెట్లుసంఘటించునా యని యోజించుచుండఁగా, వా రుభయులును జనవరినెలలోఁ జెన్నపురికి విజయము చేసిరి. అపుడు "మహారాజుగారితో నేను మీ హంసవిజ

యమునుగుఱించి మాట్లాడితిని. వారు ప్రస్తుత మీనగరమునకే వచ్చి యున్నారు. మీగ్రంథమును విందురు. మీరు వెంటనే పంపుఁ” డని రాధాకృష్ణయ్యగారు నాకు సెలవిచ్చిరి.

ఆమాటపై నాగ్రంథమును మచ్ఛ్రేయోభిలాషియు, నాకు సతీర్థ్యుండును, పారమార్థికుండు నగు శ్రీయుత దంటు సుబ్బావధానులగారితో సుందరమహలులో విడిసియున్న శ్రీజయపూరు మహారాజుగారి సన్నిధికిఁ బంపితిని.

బహుకార్యమగ్నులయ్యు మహారాజుగారవకాశము కలిగించుకొని నానాటకమును వారముదినములు మిక్కిలి కుతూహలముతో వినిరి.

ఏతద్గ్రంథశ్రవణసందర్భమున వారిసభలో నేఁ జదువఁబంపిన పద్యములు స్థలాంతరమున ముద్రింపఁబడినవి.

శ్రీవిక్రమదేవవర్మ మహారాజుగారత్యాదరముతో నానాటకమును విని, విశాఖపట్టణమునకు దయచేసినకొలఁది దినములకే “వక్తవ్యము”నుపేరఁ దన్నాటకమున కొక యుపోద్ఘాతమును వ్రాసి పంపిరి. అది ప్రత్యేకముగా ముద్రింపఁబడియున్నది. వక్తవ్యము వ్రాయుటయే గాక తమ యాంతరంగికకార్యదర్శియు, నాస్థానకవియు నగు శ్రీకవిభూషణ సెట్టి లక్ష్మీనరసింహ కవివర్యునిచే నాపై నొకపద్యమును లిఖియింపఁజేసి శ్రీవారు పంపిరి.

నానాటకముపై యవ్యాజమగు నిట్టి యభిమానమును జూపిన శ్రీమహారాజుగారియెడలను, వారి యాస్థానకవి పండితమండలియెడలను సదా కృతజ్ఞను.

నాగ్రంథమును బ్రశంసించుచు వ్రాసి సమయమునకు నాకుఁ బంపిన విద్వత్కవిశిఖామణుల యభిప్రాయములు స్థలాంతరమున ముద్రింపబడినవి.

మత్కృతికిఁ బ్రాచుర్యము కలిగించుటకుఁ దమభారతీపత్రికలో నానాటకమును బ్రచురించుట మొదలగు నుపకారములెన్ని యోసలిపి మచ్ఛ్రేయోభివృద్ధికి నెల్లపుడును దోడ్పడుచుండు శ్రీ దేశోద్ధారక, విశ్వదాత, కాశీనాథుని నాగేశ్వరరాయున కీశ్వరుఁడు దీర్ఘాయురారోగ్యభాగ్యము లొసంగుఁగాక.

శ్రీకృష్ణమిశ్రులు సంస్కృతమున వ్రాసిన ప్రబోధచంద్రోదయము సామాన్యులకు దుర్బోధకమగుటచేఁ బండిత పామరామోదమగునట్లు పరతత్త్వమును నాయోపినకొలంది నీహంసవిజయ రూపకమున వ్రాసితిని. సహృదయులు నా సాహసమును మన్నించి గుణమును గ్రహించి నన్ననుగ్రహింతురుగాక!

ఇట్లు విన్నవించు :
బుధజన విధేయురాలు
కాంచనపల్లి కనకాంబ.

ఓమితి శివమ్.

# అంబాస్తవము

కవితిలక, కనకాంబాప్రణీతము

సీ. బాల్యంబుననె యాంధ్రభాషాకవిత్వంబు
నఱపె ముర్క మంగురామానుజుండు
ఆంగ్లవిద్యారహస్యంబు నా కెఱిగించె
లీలమైఁ బిదప డ్రైస్డేలుసాధ్వి
సాంస్కృతసాహిత్య సాంప్రదాయము నృసిం
హాచార్యపండితుం డవలఁ దెల్పె
విజ్ఞానసంఘముల్ వివిధపరీక్షల
బంగారుపతకాలఁ బ్రతిభఁ గూర్చె
క్వీనుమేరీకళాశాల పిదప నంబ!
యాంధ్రబోధకురాలను నాఖ్యఁ దెచ్చెఁ
బాఠ్యపుస్తకనిర్ణయపరిషదర్హ
నను యశము విశ్వవిద్యాలయంబె కూర్చె.

సీ. పదియు రెండవయేటఁ బలికించితివికదా
నెల్లూరు శ్రీరంగనేతృమహిమ
పదియునేనవయేటఁ బ్రతిభఁగూర్చితికదా
నారీసభాగ్రాసనమున నిల్పి
పదియునారవయేట వారణాసీయాత్ర
చెప్పించితివికదా సీసమాల
నెలబ్రాయమున లిఖియింపఁజేసితి కదా
వాసి కెక్కిన మాసపత్రికలకుఁ
దరుణభావంబు రానట్టి తరుణమందె
పాండవజయంబు గౌతమ ప్రభునిచరిత

మమృతవల్లియు వ్రాయించి తంబ! యర్థ
కాయభూషితభర్గ! యో కనకదుర్గ.

మ. అమృతానందగురూత్తమాంఘ్రి జలజం బాపైనఁ జూపించి త
త్త్వము నెల్లన్ ప్రకటించి యాఘనునిబోధం బాస్థతోఁ బద్యకా
వ్యముగా వ్రాయఁగఁ జేసి సత్కవుల కాహ్లాదంబుగల్పింతు న్నా
య్యమకా! నీపదభక్తురాండ్రకు నసాధ్యంబేది కాత్యాయనీ!

సీ. ఏన్గుపై నెక్కి యూరేగి సత్కవులకు
బెట్టుకూర్చినవాఁడు వేంకటకవి
ముగురువ్రాసిన వేదమును భారతము నొంటి
గృతిఁ జేయుసుకృతి శ్రీకృష్ణసుకవి
కృతివిమర్శకుల కగ్రేసరుం డనుఖ్యాతిఁ
గొన్నట్టి దిట్టయా కుప్పసామి
సర్వకళావిచక్షణుఁడు సత్కవి యన్న
కీర్తిగాంచిన కాశికృష్ణబుధుఁడు
నన్ను నాజీవయాత్ర మన్ననలు సలిపి
కవితిలక మంచు నన్నెంతొ గారవమునఁ
బిలుచు టెల్లను నీకృప కలిమిఁగాదె
తనువిభూషితభర్గ యో! కనకదుర్గ.

ఉ. పండితగమ్య మాటను ప్రబంధమునొంటను జీవయాత్ర భ
క్తుండగువానికిన్ దెలియు ధోరణి నాటకమున్ రచించి భూ
మండలమందు సద్గురులమార్గము నిక్కలి నిల్పుటెల్ల నీ
వండగ నుండఁగాదె జగదంబరో! సాధ్యమదేరి కన్యథా?

మ. భగవద్భాగవతాంఘ్రి సేవనమె మద్భాగ్యంబుగా వ్రాసి పె
ట్టఁగఁ బంకేజభవుండు లౌకికపుబాటల్ వీడి మోక్షంబు తి
న్నఁగఁ జేర్పంగల సద్గురూక్తులను డెందంబందు నన్నిల్పి దీ
క్షగ సత్కావ్యములన్ రచించెదను సాక్షాచ్చారదా సత్కృపన్.



శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారు,
జయపురాధిపతి.

శ్రీ జయపురాధీశ్వరునకు కవితిలక కం. కనకమ్మగారి

# విన్నపము

క. అవధారు జయపురీశ్వర
భవదాస్థానంబు దుర్లభంబగు రాధా
భవనామ బుధవరేణ్యుని
యవిరళకృప నీకు వినుతు హంసవిజయము౯.

క. మముబోటి కవులగొడవలు
మమత౯ వినునట్టిరాజు మహిఁగలఁడే వి
క్రమదేవ కవిసుధాంశుని
నుమ, జయపురి నిల్పె బుధుల యుల్లము లలర౯.

క. ఋషివర్తనులకు సచ్చే
ముషిగలవారలకు భక్తపుంగవులకు స
ద్విషయమును హంసనాటక
మిషమునఁ బల్కితిని హరిని మెప్పింప నృపా.

క. రాధాకృష్ణాచార్యుఁడు
మేధావియుఁ దత్త్వఘనుఁడ మేయపదవికి౯
సాధనమగు నానాటక
బోధము విని మదినిఁ బొంగి పూర్ణప్రీతి౯.

చ. తొలిపలుకేను వ్రాయుటొక దొడ్డదిగాదిక భారతావని౯
గలనృపకోటికెల్లను శిఖామణి యాజయపూరునాయకుం
డలఘుకవిత్త్వతత్త్వనిధి యాతఁడు విక్రమదేవవర్మని
స్తులభవదీయ సత్కృతికి శోభనుగూర్చునటంచుఁ దెల్పఁగ౯.

క. తెంపున నానాటకముగ
బంపితిఁ ద్వత్సభను జదువఁబండిత రాజా
లింపంగ నుత్సహించుట
కింపైయుండుటయె కాదె కృతికి ఫలంబౌ.

మ. గురుపుత్రుండుసతీర్థ్యుఁడుగ హితుఁడు నాకుగ మాన్యుఁడుగ భారతీ
వరివస్యాకుశలుండు రాజసభలగ భవ్యుండు దంట్వాన్వయా
భరణుండీయవధాని మత్కృతిని భూపా! నీసభగ విన్పుదాఁ
బరమోత్సాహముతోడఁ బాడుచు మహాప్రౌఢుల్ప్రహర్షింపఁగన్.

క. ఆకుశలవులగ ముగ వా
ల్మీకులకై పోలె లీల మేదిని సభలగ
నాకృతుల భక్తఁ బాడగ
* శ్రీకృష్ణగురుండు చేసె శ్రీయవధానిగ.

గీ. కవనముల కేమి యెన్నైనఁ గట్టవచ్చుఁ
బరమపురుషునిపై భక్తిఁ బ్రబలఁజేయు
పొత్తములు వ్రాయుటది పూర్వపుణ్యఫలము
క్రమసద్గుణజాల విక్రమనృపాల.

చ. కవులన బ్రహ్మముగ దెలియఁగల్గినవేత్తలు బ్రహ్మవిద్యకుగ
దెవులు ఘటిల్లుకాలమున ధీరతతత్త్వముఁ జాటునట్టి స
త్కవితల కేమిచేయ నధికంబగు సత్కవిరాజవైన నీ
కెవరు వచింప నేమికల దేలిక! పాలనసేయు ధర్మముగ.

---

* (అమృతానందనాథస్వామికి శ్రీకృష్ణభూషణుండను నామాంతరము కలదు).

## మహారాజరాజశ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజుగారి

# వక్తవ్యము

విద్వాన్-కవితిలక-శ్రీ కాంచనపల్లి కనకాంబగారు రచించిన "హంసవిజయ" నాటకమును గ్రంథకర్త్రి ప్రేరణమున శ్రీయుత దంటు సుబ్బావధానులగారు దయతోఁ జదివి వినిపింపఁగా విను భాగ్యము నాకుఁ జెన్నపురమున మొన్న జనవరి నెలలోఁ గలిగినది.

ఇందలికథ స్వకపోల కల్పితము. పింగళి సూరనామాత్యుని కళాపూర్ణోదయమందువలెనే హంసవిజయమందును సరస్వతీ చతురాననుల శృంగారసల్లాపము కథాబీజమైనది. ప్రబంధమందు గ్రంథమధ్యమునఁ (బంచమాశ్వాసమునఁ) గథాబీజముండుట కథాపటుత్వమున కవసరము. నాటకమందు గ్రంథాదినే (ప్రథమాంకమునఁ బ్రథమ రంగముననే) యుండుట కథావగాహనమున కవసరము. ప్రబంధమందుఁ గల చిక్కు దీనియందు లేక, ప్రేక్షకులు వినునంతటనే బోధపడునంత సులభముగాఁ గథాబీజ ముండుట సముచితముగా నున్నది.

సత్యలోకమున శారదాదేవి వీణాగానము చేయుచుండఁగా బ్రహ్మదేవుఁ డామెను జేరఁ జని, యామె చూడామణియందలి తన ప్రతిబింబమును గాంచి, పరపురుషభ్రాంతిని వహించి, భార్యవలనఁ దనపొరపాటు గ్రహించి, తన కట్టిభ్రాంతియుఁ దన దేవియెడల వట్టి దోషశంకయుఁ గల్పించిన యా చూడామణికిఁ గొంతకాలము జడత్వము ఘటిల్లునట్లును, దన భ్రాంతిని జూచి నవ్వినహంస కొంత కాలము భ్రాంతినిఁ బడునట్లును శపించెను. ఆశాపమునుబట్టి బ్రహ్మ వాహనమైన హంస భూలోకమునందుఁ గల్యాణపురాధీశ్వరుఁడైన

రాజశేఖరమహారాజునకు నిరంజనుఁడన్న పేర నందనుఁడై యుద్భవించెను. సరస్వతీచూడామణి పినాకినీతీరమున సోమశిలాక్షేత్రమందు నయోనిజయై శారదయను బాలికగా జన్మించెను.

నిరంజనునిపుట్టుక వరప్రసాదమున. రాజశేఖరమహారాజు రాజ్యభోగములయందు విముఖతఁగాంచి గురుకటాక్షమునఁ దరింప నిశ్చయించి, తిరుపతి కొండమీఁద జాబాలితీర్థమున జయంతాశ్రమమందున్న పరమహంసయను పేరుగల మహామునిని నిజమహారాజ్ఞియైన ధర్మాంబతోఁగలిసి యాశ్రయింపఁగా నా మహామునీంద్రుఁడు ముక్తిమార్గ ముపదేశించి, వారికి "భక్తాగ్రేసరుండును, జ్ఞానప్రదుండు నగు ధీరుం డుద్భవించు"నట్లు వరమిచ్చెను. తద్వరసంజనితుఁడు నిరంజనుఁడు. పుట్టుకకుఁ దగినట్లుగా నారాజకుమారుఁడు, "జన్మప్రభృతి మహాభక్తలక్షణములతో" నొప్పారెను. నిరంజననామము పాపరాహిత్యము సూచించునని తెలిసికొని, తన్నట్టిపేరఁగాక జీవుఁడని పిలువవలసినదని కోరినబుద్ధిమంతుఁడతఁడు. ఆతనయునికి నూతనపద్ధతులను గాక, తగిన గురునియొద్ద సద్విద్య చెప్పించి విద్యాభ్యాసానంతరమున రాజ్య మతనివశముచేసి రాజశేఖరుఁడు పత్నీసహితుఁడై జయంతాశ్రమమునకుఁ జని పరమహంసమహామునిసన్నిధానమున నుండెను. రాజ్యాభిషిక్తుఁడైన నిరంజనుఁడు "వివాహము కేవల మైహికంబును దుచ్ఛంబు" నను భ్రాంతినిఁబడి—ఆభ్రాంతియే శాపమూలకము,—మంత్రిప్రముఖులెవ్వరుచెప్పినను గృహస్థాశ్రమస్వీకారమున కంగీకరింపఁడయ్యెను. అట్టి యతనిభ్రాంతి పరమహంస మహామునీంద్రునిదర్శన మైనంతటనే తటాలున విడినది. "సాధుదర్శనంబు సన్మంగళంబనుమాట సత్యము." పిమ్మట నిరంజనుఁడు-పిత్రాజ్ఞ శిరసావహించి తనయం దత్యంతానురక్తమైన మేనమామకూఁతును, సార్థకనామధేయమైన బుద్ధిమతి యనుకన్యారత్నమును వివాహమై, యామెతోఁ గలిసి, తీర్థయాత్రలు సలిపి పరమహంస మహామునీంద్రుని యాశ్ర

మంబుఁ జేరుకొని, సంపూర్ణజ్ఞానమును సంపాదించి, లోకమునకు జ్ఞానప్రదాత యైనాఁడు. బ్రహ్మదేవుని శాపమున మనుష్యత్వ మొంది, కొంత కాలము భ్రాంతినిఁబడి, తుదకు విజయము గాంచిన హంసచరితము హంసవిజయము.

సోమశిల-క్షేత్రమున శాపమూలమున జన్మించిన శారదా చూడామణి, శారద బాల్యముననే సకలకళాకోవిదయుఁ గవయిత్రియు మహాయోగినియునయ్యు మనశ్శాంతి లేక జడత్వమునఁబడి,—యా జడత్వమే శాపమూలకము — సద్గురుకటాక్షముననే తన జడత్వము తొలఁగునని నిశ్చయించి, యోగసిద్ధిమూలమునఁ గామరూపుఁడై హంసగావచ్చిన నిరంజనుఁడు దారిచూపఁగా జయంతాశ్రమమును జేరి, పరమహంస మహామునిని దర్శించి, యామహాత్ముని యుపదేశమున జడత్వమును బాసి లోకములో ననేక బాలికలకును, స్త్రీలకును జ్ఞానప్రదాత్రియైనది. శారదకు మార్గదర్శియైనది హంసయేయగుట, నారీతిని సైతము హంసవిజయము.

కథకు ముఖ్యులైన శారదానిరంజనులకే కాక, ధర్మాంబా రాజశేఖరులకే కాక, మఱియు ననేకులకుఁ దత్త్వోపదేశ మొనరించి తరింపఁజేసిన భగవత్సమానుఁడు పరమహంసమహాముని మహాత్త్వమిందు విశేషముగా వర్ణితమైనదిగాన దీనిని హంసవిజయ మనియే కాక పరమహంసవిజయ మనియుఁ జెప్ప నొప్పును.

హంసవిజయమునందలి ప్రధానరసము శాంతము. భక్తిజ్ఞాన వైరాగ్యములు ముఖ్యముగాఁ బ్రతిపాదింపఁబడినవి. ఆరంభమే తిరుపతి యాత్రతో, ఆ యాత్రికులు, హరిదాసులు, భక్తులు వారి గోవిందనామస్మరణములు, భజనకీర్తనలు, భగవత్ప్రార్థనలు, స్వామిసేవ, మంగళహారతులు,—ఓహో! ఏడుకొండలవాఁడు, వేంకటేశ్వరుఁడు, కన్నులయెదుటికి వచ్చినట్లగును.

ఆపైని, వేదాంతచర్చ, రాజశేఖరాదుల వైరాగ్యము, నిరంజనుని జ్ఞానసంపత్తి, శారదాయోగసంపత్తి యామె "సత్యసారము" ఇన్నింటికంటెను హెచ్చుగాఁ బరమహంసమహాముని యుపదేశవాక్యములు—ఇవి యన్నియు గ్రంథకర్త్రికిఁ గల పరమార్థచింతకును, బ్రహ్మజ్ఞానమునకును బ్రబలసాక్ష్యములు. వేదాంతగ్రంథములయందలి వాక్యరత్నము లనేకము లీనాటకమందు వెదఁజల్లఁబడియున్నవి. గ్రంథకర్త్రి వాక్యములును, దత్తుల్యములైనవి, పుటపుటకునుదగులుచునేయుండును. మచ్చునకు :—"సంసారసుధాబ్ధిఁ బండునుగదా! పన్నగభూషుంబలె నీదుభక్తుఁ డొకఁడే నారాయణా" "బ్రహ్మవిద్యకుఁ గావలసిన ధీరత్వములో సగముండిన క్షాత్రమునకుఁ జాలును." "నూరేండ్లు బ్రదికినను మృత్యుతత్త్వమును దెలిసికొనక మరణించిన... వాఁడకాలమరణము నొందినవాఁడే"; ఇత్యాదులు-జ్ఞాన - వైరాగ్యములయందు గ్రంథకర్త్రికిఁగల యభిమానమును జూడఁగా, నాటకమందలిశారద గ్రంథకర్త్రిప్రతిబింబమేయని తోఁచుచున్నది. ఈయమయు నామెవలెనే యనేకబాలికలకు జ్ఞానోపదేశమొనర్చి తిన్ననిమార్గమునకుఁ ద్రిప్పుచున్నట్టి యుపాధ్యాయిని. (చెన్నపురిని మైలాపురమందుఁగల క్వీన్ మేరీస్ కాలేజిలో లెక్చరరు) భక్తురాలైన తరిగొండ వెంకమ్మను గౌరవముతో గ్రంథమం దొకటిరెండుచోట్లఁ బ్రశంసించుట భక్తియందీమెమనస్సు మగ్నమైయున్నదనుటకు నిదర్శనము : ఇదియంతయు నెంతయుఁ బ్రశంసనార్హము.

ప్రధానరసము శాంతమేయైనను, దక్షిణ రసములును దత్తత్సందర్భముల హంసవిజయమున నుచితముగాఁ బోషింపఁబడినవి. బుద్ధిమతీ నిరంజనుల మోహవిషయమునఁ జూపఁబడిన శృంగార రసము బహులలితము. నిరంజనునిమీఁది మోహమున విరహబాధ పడుచు నతనిఁగూర్చి బుద్ధిమతిరచించి పఠించిన పద్యాదుల నుద్యానవన శుక

ములును మననము చేసికొనుచున్నట్లు చెప్పఁబడుట మిక్కిలి చక్కఁగా నున్నది. జయదేవుని గీతగోవిందములోని యష్టపదులను గానము చేయును రాధికతోఁ దాను దాదాత్మ్యసిద్ధి బుద్ధిమతి కలిగించుకొనుటయు, నట్టియవస్థలో నిరంజనుఁ డామెను గలిసికొనుటయు, వారి శృంగారసంభాషణమును, సభ్యతావిరుద్ధమైన వాక్య మొక్కటియు లేక, స్త్రీలు వ్రాయఁదగిన శృంగారరస మిట్టిదనుట కాదర్శప్రాయముగా నుండి, ముద్దుపళని శృంగారమం దేవగింపు కలిగించుచున్నది.

హాస్యరసమునకును హంసవిజయమునఁ దావుగలదు. డామాషోలీ (దామోదర) శాస్త్రి సంభాషణములు చిఱునవ్వును బుట్టించుచునే యుండును. వైరాగ్యము ప్రధానవిషయముగాఁగల నాటకమున కామాత్రము హాస్య మత్యంతావశ్యకము. దామోదర శాస్త్రి సామాన్యవిదూషకుఁడు మాత్రమే కాఁడనుట కతఁడు బుద్ధిమతీ నిరంజనులకు సంధానముచేసిన నేర్పు తెలుపఁగలదు. ఆవిషయమున నతఁడు మాళవికాగ్నిమిత్రమునందలి విదూషకుని గొంతవఱకు తలపించును. షేక్స్పియరు మహాకవి వ్రాసిన కింగులియరునాటకములోని విదూషకుని వాక్యములందుబలె డామాషోలీశాస్త్రివాక్యములందును వివేకమంతర్భూతమై యున్నది.

హంసవిజయమున సంస్కృతనాటకలక్షణములు పాటింపఁబడినవి. విష్కంభములు, ప్రవేశకము మొదలయినవి సరియైన తావుల గలవు. అంకవిభజనము బాగుగా నున్నది. నాటకప్రదర్శనములందు (గ్రంథకర్త్రి) పాల్గొన్నది కానికారణమునఁ గొన్నిచోట్ల గద్యాదులు దీర్ఘము లయినవి. కొన్నిరంగములు హెచ్చుపడినవి. ప్రదర్శన కాలమున నట్టివి కుద్దించుకొనవలసినదని, తగ్గించుకొనవలసినదని పీఠికయందామె సూచించుటకు సమ్మతించినది.

అట్టిదైర్ఘ్యము ముఖ్యముగాఁ జర్చలలోఁ గనఁబడును. నిరంజన కుమారుని విద్యాభ్యాసమునుగూర్చి పండితులు చర్చింతురు. వివిధ పక్షములవారు తమమతములఁగూర్చి యుపన్యసింతురు. పరమతముల ఖండింతురు. గ్రంథకర్త్రికి నూతనపద్ధతులయందు గౌరవములేదు. సనాతనమైన మన గురుకులవాస సంప్రదాయమందే యామె కభిమానము. దానిని గృష్ణశర్మచేత విపులముగా నామెచెప్పించినది. వర్తమానవిద్యాపద్ధతులను డామాడొలీశాస్త్రిచేత వెక్కిరింపించిన- "బూడిదగుమ్మడికాయ పొట్టలో నడ్డముగ గరిటెగ్రుచ్చిన 'ఈ' అగును." ఇత్యాదివాక్యములతో! నవీనవిద్యాపద్ధతులలో, "విద్యాప్రణాళిక నాయకులకే తెలియ-" దన్నవాక్యము గ్రంథకర్త్రి యనుభవమునుబట్టి వ్రాసినది. "అర్థకామముల ధర్మానుగుణముగ నడిపించి, మోక్షముసాధించు టార్యపద్ధతి", "పరిపూర్ణమైనది భారత విజ్ఞానము." ఈ మొదలగు వాక్యము లామెకు హైందవవిద్యా సంప్రదాయములందుఁగల గౌరవమునకు సాక్షీభూతములు. ఒక్కవిద్యా విషయముననేకాదు; పాశ్చాత్యదేశములందలి యశాంతి, యాశాపరతంత్రత, యన్యోన్యకలహములు, మొదలైనవి గ్రంథకర్త్రి మనస్సునకు వెగటుగొల్పుచున్న విషయములనుట స్పష్టము. "నవనాగరికదేశములందెచ్చటఁ జొచ్చిచూచినను దుపాకిమందు కంపుకొట్టుచున్న" దన్నయొక్క-వాక్యమే చాలును, ఆమె యభిప్రాయ మెటుపరుగెత్తుచున్నదో కనుఁగొనుటకు! నాటకమునుజదువు నవనాగరకవిద్యావతులీవిషయములను శ్రద్ధతో గమనింతురుగాక! ఆర్యవిద్యాపద్ధతులను బట్టి తేలిన నిరంజనునికిఁ గేవలము వ్యతిరేకముగాఁ దేలినాఁడు, పాశ్చాత్యనాగరకసంపర్కమునకు లోనైన యన్నంభట్టు. అన్ని దుర్లక్షణములు నతని కలవడినవి. త్రిప్పాట బహుకష్టమైనది. "ఉత్తుంగ తరంగభంగితంబై పరుగెత్తుచు దుముకుచుఁబోవు తరంగిణిని మర

ల్చుట యెంతకష్టమో, సంపర్కదోషంబునఁ బశ్చిమాభిముఖమై నిమ్నమార్గమునకుఁ దిరిగి పరుగెత్తు చిత్తసంకల్ప ప్రవాహమును ప్రాఙ్ముఖముగాఁ ద్రిప్పుట యంతకష్టము." అయినను బరమహంస మహామునీంద్రుని శిష్యుఁడైన నిరంజనునిబోధన లన్నంభట్టునకుఁగల యహంకారమమకారములను బోగొట్టి యతనిచేత జోలెపట్టించినది. అతనికేకాదు. "పాశ్చాత్యవాతవ్యాధి తగిలి మెడమెలితిరిగి కేవలము పశ్చిమముఖుండై చిరకాలము పుల్లే యుండిన" మనసబు సీతాపతి పంతులకును, "బరమహంసస్వామి యొసంగిన విజ్ఞానచపేటికా ప్రహారంబున వెనుక కీడ్చుకొనిపోవుచున్న ముఖము సుముఖమై ప్రాఙ్ముఖమయ్యెను." ఆహా! ఆర్యవిజ్ఞానమహిమ యట్టిదికదా!

వక్తవ్యవిషయము లింకను విశేషముగాఁ గలవు. గ్రంథప్రాశస్త్యమును దెలుపుటకు మీఁదను వివరించినవి చాలును. ఇఁక గ్రంథకర్త్రిఁ గూర్చి:

"చదివినఁ జదువకయున్నన్, ముదితలు విద్వాంసురాండ్రు పుట్టుక" నని యామె వ్రాసినవాక్యము కేవలమును స్త్రీజన పక్షపాతము తెలుపునదిగాక, యింతకుమున్నే వివేకవంతులైన యనేకులు పురుషులును వ్రాసినదే. దాని సత్యాసత్యము లెట్టివైనను, జదువు కొనిన స్త్రీలు పురుషులను మించనీ, మించకుండనీ, సమాన లగుటకు సందేహము లేదు. ఆంగ్లనవలలో జేన్ ఆస్టిన్, జార్జి ఎలియటు మొదలైన స్త్రీలు వ్రాసిన నవలలు పురుషులు వ్రాసిన నవలలకుఁ దీసిపోవునవి కావు.

హంసవిజయము రచించిన శ్రీకనకాంబగారు విద్వాన్ పరీక్షలో మొదటితరగతియం దుత్తీర్ణయైనది. సంస్కృతాంధ్రముల యందుఁ బాండిత్యముగలదే కాక, యామె యాంగ్లమున నింటర్మీడియేటు పరీక్షవరకుఁ జదివినది. ఆమె యాంగ్లభాషాజ్ఞానమునకుఁ

దాహరణములు నాటకమున లలితాశారద లుపయోగించిన యాంగ్ల వాక్యములు, మఱినాటకమందు గోచరించు నాంగ్లగ్రంథ పరిచయవాసన. నేటిస్త్రీలలో మఱి కొలఁదిమంది విద్యా పరీక్షలోఁ దేలినవారును గలరు. వారిలోఁ గవిత్వము చెప్పువారును గలరు. కనకాంబగారు పట్టివిద్వాంసురాలే కాక, కవయిత్రియే కాక, కవికులతిలక బిరుదమును సంపాదించినది. వర్తమాన కాలమునఁ గల కవయిత్రులతోఁగాని, కవులతోఁగాని యామెను సరిపోల్చి చెప్పుటకు నేను దలఁచుకొనలేదు. అట్లు చెప్పుటయు నసంభావ్యము. పూర్వకవయిత్రులలో మొల్ల కవిత్వమందుఁగల మార్దవమును, తరిగొండ వెంకమ్మ కవిత్వమందుఁగల భక్తిపారవశ్యమును గనకాంబగారి కవిత్వమందుఁ గలవు. భాష లలితము, శైలిసరళము, ఉపాధ్యాయుని వ్రాత నిర్దుష్టమని వేఱ చెప్పవలయునా?

హంసవిజయమును జదివి నాయాంతరంగిక కార్యదర్శి యాస్థానకవి, కవిభూషణ శ్రీయుత సెట్టి లక్ష్మీనరసింహముగారు చమత్కారముగాఁ జెప్పిన పద్యముతో విరమించుచున్నాఁడను.

గీ. ఇంటిపేరను దనపేర, హేమముగల,
యట్టి కాంచనపలి కనకమ్మ మేలి
వన్నె కనకమ్మ, కవిత సువర్ణకలిత,
మాపె సొమ్మాట యజుకొమ్మ యలుగకమ్మ.

విశాఖపట్టణము, 21-2-1935.

ఇట్లు:
శ్రీ విక్రమదేవవర్మ,
శ్రీ జయపురాధిపతి.

# "విక్రమేశ తారావళి"

కవితిలక, కంచనపల్లి కనకాంబా ప్రణీతము

క. యుక్తమె విక్రమదేవుని
సూక్తులవక్తవ్య మనుట సుకృతులలోనన్
యుక్త మయుక్తం బెఱిఁగెడు
శక్తికిఁ దక్కవిన్నృపాలుసాటిఁ గలుగమిన్.

క. భవదీయాస్థానంబునఁ
గవిభూషణుఁడైన సెట్టికవిసింహాకృత
స్తవ మెఱిఁగి యలరితిన్ వా
స్తవమున్ సత్కవులు తెలియఁజాలుదురనఘా.

ఉ. హంసజయమ్మునన్ గల మహత్తరతత్త్వము గుర్తెఱింగి వి
ద్వాంసులకున్ ముద మ్మొదవు వైఖరి వ్యాసమునున్ లిఖించి సా
రాంశము తేల్చె నీజయపురాధిపుఁ డద్దిర! యార్యధర్మవి
ధ్వంసము గల్గుకాలమున దక్కెను దిక్కన సాధుపాళికిన్.

శా. వాణిజ్యం బయగున్ గవిత్వమును జేర్పన్ రాణివాసంబులన్
వాణీదత్తము మత్కవిత్వ మది భూపా! తత్త్వముం దెల్పుటన్
రాణించెన్, నరకాంత మానుగద యీరాజ్యంబు నద్దానగీ
ర్వాణప్రఖ్యుల జ్ఞానబీజధరులన్ బ్రహ్మణ్యులన్ బ్రోవుమా!

క. శుకనాసోపన్యాస
ప్రకటిత గర్భేశ్వరత్త్వభంగు లకట నే
టికి నెందుఁ గాన నో ధా
ర్మికులన్ బోషించువాఁడు పృథివిం గలఁడే.

ఉ. ఎక్కడ నుంటి! వేమి గతి! యెచ్చటఁ దింటి! వ దెట్లు వచ్చితీ
విక్కడ! కెట్లు వ్రాసితివి? యింతటి గ్రంథము! చిక్కు లేదు నీ
యక్కఱ లన్ని దీఱుఁ నిఁకనంచుఁ గవీశుల నాదరించువాఁ
డెక్కడ నుందురో! జయపురీశ్వర! దేవుఁ డెఱుంగు నిక్కలిన్.

చ. కవనము నేర్చి పద్యములు గట్టి నృపాలుర బట్టులట్లు సం
స్తవములు చేసి జీవనము సల్పెడువారల కేమొ కాని వా

స్తవమగుశక్తి గల్గి పరతత్త్వము సద్గురులొద్ద నేర్చు సా
ధువులగువారికిన్ స్థితిగతుల్ గనిపెట్టెడుధీరుఁ డెవ్వఁడో!

ఉ. భారతధర్మబీజముల భక్తులకై పరిరక్షసేయున
వ్వారలు ధీరు లవ్విబుధవర్యుల నార్యులఁ బ్రోచుచుండునా
భూరమణుండు ధీరుఁడు ప్రబోధ మొసంగఁగజాలు కావ్యముల్
తారకమూర్తిపై నుడువు ధన్యులు ధీరులు విక్రమాధిపా!

ఉ. సూరులు తొల్లి సత్యమును జూడఁగఁగల్గిరి! రాజులో క్రియా
శూరులు ధర్మవీరు లగుచున్ భరియించిరి సాధుపాళి వా
క్చూరులు నేఁడు పత్రికలఁ జూపుచునుండఁగఁ విద్దె, లాస్థతో
ధీరులు సద్గురూక్తవరదీక్షల రక్షయొనర్తు) జ్ఞానమున్.

ఉ. అన్నిటి మించినట్టిపురుషార్థము మోక్షము దానికన్న నె
న్నెన్నియొవిఘ్నముల్ గలుగునెవ్వఁడో నేర్చును గోటి కొక్కఁడ
న్నన్న ఫలం బతండె జగ మంతకు నాతఁడు వృద్ధిపొందఁగాఁ
దెన్నుఘటించుచేని కిల దీటగు నెవ్వఁడు విక్రమేశ్వరా!

ఉ. ఒక్కొకవిద్య కొక్కొకని నూపిరితోడుత నిల్పరాదొకో!
యొక్క నరేశ్వరుం డయిన నోపికతో సకలాంధ్రభూమికిన్
దక్కితి వొక్కఁ డీవెటులు ధర్మము నిల్పెదొ విక్రమేశ్వరా!
చిక్కటిరూపుమాసినవి దేశపువిద్యలు పట్టువీడుటన్.

చ. పదిపదియేండ్లకొక్కతటి పండితులన్ గణియింప నక్కటా
హృదయము వ్రీలు వృక్షములకేఁగల దొక్కట లెక్క, నేఁడు ప్రాఁ
జదువులవారు పుట్టినను జచ్చిన నెంచెడువాఁ డెవండు పె
న్గాదవె విపత్తు విద్యలకు నోపృథివీశ్వర! యెట్లు మాన్పెదో.

చ. అవసరమందు దత్తమగునట్టిది దాన మటంద్రు కుంభినీ
నవ పదిలక్ష లిచ్చిన వృథాగద! తొల్లిటిబ్రహ్మవిద్య సా
నువులకు నీయఁగల్గు విబుధుల్ నిలువందగు నీడనీని వె
ట్టివియును సంస్థ లెన్నికల డిగ్గుపడున్ బరమార్థగోష్ఠిలోన్

ఉ. వేసెడుబుద్ధి యుండియును జేయఁగఁజాలమి బుద్ధిమంతు లా
యాసము నొందుచుందు రెపుడా! తరుణం బని చూచుచుంద్రు నీ

కీసిరి వచ్చి పైఁబడుట యెంతయు మేల్గద దీపముండ నా
వానము చక్కఁబెట్టుము నృపా తఱిమించినఁ జేయవచ్చునే.

చ. కవనము సత్యముల్ దెలుపఁగల్గునె! సత్యము సత్యవంతుఁడే
భువి నెఱుఁగున్! గురూత్తముల మ్రోల నహంకరణమ్ము మాని ని
క్కవమగు వర్తనంబుఁ గనుకోవిదుఁ డీశ్వరతత్త్వమెల్ల వా
స్తవము గఁగాంచు బ్రహ్మమయి తాఁగనఁగల్గునుగాదె బ్రహ్మమున్

చ. పలుకఁగనేర్చు సత్కవికి బత్తెము పుట్టనినాఁడు చాటుగాఁ
బలుకక సత్యమున్ దరుచు భక్తుల కెవ్వఁడు భుక్తి పెట్టు రా
జులు గనుగొందురే! యెదుటఁజూచియుఁ గాననివారు దేవుఁడ
వ్విలయముఁబాప నిన్నుఁ బృథివీపతిఁ జేసెను విక్రమాధిపా!

ఉ. ఏనుఁగులమ్మి కార్లపయి నెక్కెడికక్కుఱితిన్ జరించు భూ
జానులు సత్కవీశ్వరుల సాకఁగనేర్తురె సర్వవిద్యలన్
దాను భరింపఁడేని, యిలఁ దానొకరాజుగ నుండనేల! సం
స్థానమదేల! వానికొక స్థానమదేల! మదించి మించఁగన్.

ఉ. బొమ్మలఁజేసి యెవ్వరెటు మోసుకపోయిననట్ల పోవు ద
ద్దమ్మలు, పార్శ్వవర్తులకు దాసులు రాజులు, వారికేల త
త్త్వమ్ములు, ధర్మముల్, గురుపదమ్ములు, నేనుఁగుపై జవాది, సం
ద్రమ్మున వృష్టియున్, మరుపదమ్మునఁ బెట్టినశాలిబీజముల్.

ఉ. మంచిది మంచి దిద్ది కడుమంచిది మంచిది యంచుమాటలన్
ముంచినఁ బ్రాణపంచకము పోవదె ప్రోవకయున్న నద్దికా
మంచియు, కాదయేని గడమంచియవంచనమేల! యేమికా
వించిన బ్రహ్మవిద్య కిలబీజము నిల్చునో చూడు భూవరా!

ఉ. ఇచ్చక మేల రాజుల కొకింత కవీశుల కుండు గాక నీ
మెచ్చుటయే నిజం బయిన మేకొనకుండుమె హంసనాటకం
బచ్చుపడంగఁ దెల్పు పరమార్థము, నర్థము ప్రాణమున్ వెసన్
బొచ్చెములేక సాధువులఁ బ్రోవనుఁ గావనుఁ దేవె భూవరా!

ఉ. తక్కువలేక సద్గురుఁడు తత్త్వముఁ దెల్పెను నాకు భుక్తికిన్
దక్కువలేదు, గౌరవము తక్కువలేదు, సభాంతరమ్ములన్

మన్కవమీఱ మత్కృతుల మన్ననఁజేసిరి సత్కవీంద్రమ లో
ధిక్కృతవైరి! విక్రమసుధీ నృపమౌళి! పరాంబసత్కృపన్.

ఉ. అచ్చునఁ గూర్ప గ్రంథముల నచ్చటనిచ్చటఁ ద్రిప్పకుండఁగా
లచ్చికృపన్ ఘటిల్లె నవిలంబముగా నిఁక నొచ్చెమేమి? నీ
మెచ్చుట చాలదే! కృతి కమేయఫలం బది పైనఁ బెచ్చుఁగా
నచ్చతురాస్యుఁడో జయపురాధిప! యే మని నిర్ణయించెనో.

గీ. దీక్ష సద్గురులొద్ద నధీతి యమ్యో
నర్థులకు బోధ మొనరింతు నహరహంబుల
హరికృపావశమునఁ గొంత యాచరింతు
సాగవలసిన దింకఁ బ్రచార మొకఁడె.

ఉ. ఎన్నిప్రచారముల్ గలుగు నిక్కలి నేఁడొక బ్రహ్మవిద్యకే
మన్నన లేకపోయె,మునిమాన్యులు తొల్లిఁటిరాజు లెల్ల నా
పన్నులఁగాచుపొంటెను దపస్విలఁగాచెడు పొంటె, దీక్షఁ గై
కొన్న దెఱుంగవే! యడవిఁగుయ్యిడ డయ్యుటగాదె భూవరా!

ఉ. యోగ్యుఁడ వీవు కాన నిటులోపికతో వచియించుదాన దౌ
ర్భాగ్యులు మెచ్చనెన్నఁడును వ్రాయదు నాకల మేమి నిత్యమీ
భోగ్యములం దహర్నిశము మున్ మును లొందినసిద్ధిఁ బొందఁగా
వాగ్యతులైన భక్తులకుఁ బట్టగు మింకను విక్రమాధిపా!

గీ. చెప్పఁదగినదిందుఁ జెప్పంగఁబడె విక్ర
మేశ వినఁగఁ దగుదు వీవటంచు
నీకు నచ్చకున్న నిక్కంబుగా నాకు
భర్త్రహరికి నొకఁడె భాగ్య మవని.

క. దేవబ్రాహ్మణభక్తియు,
భావజ్ఞత, కార్యదీక్ష, పాత్రజ్ఞత, స
త్సేవయు, శ్రీహరి విక్రమ
దేవున కిడి ప్రోవు మాంధ్రదేశవిబుధులన్.

---

## Sir S. RADHAKRISHNAYYA GARU'S,
*Vice - Chancellor*
ANDHRA-VISWA-KALA-PARISHAT.

## FOREWORD

" I had great pleasure of reading in Mss. Vidwan Kavitilaka Kanchanapalli Kanakammagaru's "Hamsa-Vijayam". It is some-what out of the way, in the sense, that it has for its central theme, the search of the soul for God. The authoress, makes out that she is herself an earnest seeker, and is anxious that her readers must be infected with, her own enthusiasm for spiritual life. The book deserves hearty welcome especially at a time when the quest for religion does not enjoy the prestege which it did in our country heretofore.

The Raja-Saheb of Jayapur has given expression to his high estimate of the talents of the authoress. I am not competent to offer a judgemnt on this question, though it gives me great pleasure to endorse the opinion of such an expert as the Rajasaheb."

WALTAIR,
5th MARCH 1935.

Extracts from Sir S. Radha-Krishnayya's letters to the authoress.

"..........................................................................................

" I have also written to Sir Alladi Krishnaswami Iyer.

While I am greatly impressed with your learning, and seriousness of purpose and anxiety to spread ultimate truths, I also feel that it would be better for you and your work, if it is introduced to the public by some one like the Maharaja of Jayapur who has not only learning in Telugu but also sympathy for our culture".

WALTAIR,
29th OCTOBER 1934.

ఆంధ్రవిశ్వకళాపరిషద్బోధాచార్యులు

శ్రీయుత సర్. యస్. రాధాకృష్ణయ్యగారి

# తొ లి ప లు కు

శ్రీమతి విద్వాన్ కవితిలక, కంచనపల్లి కనకాంబగారి, హంసవిజయనాటకంబును, వ్రాతప్రతియందే చదివి, మహానందమును బొందితిని. పరమాత్మ నన్వేషించుటయే ప్రధానవస్తువుగఁ గలిగియుండుటలో నీగ్రంథము సామాన్యమార్గముల (వ్యవహారపంథల) నతిక్రమించినది.

తాను బరమభక్తితో నాత్మవస్తువు నన్వేషించునదనియుఁ, దన గ్రంథము చదువువారికిఁగూడ నట్టి యాధ్యాత్మజీవనమందుఁ దనకుఁగల యుత్సాహమును సంక్రమింపఁజేయువ్యసనము కలిగియున్నదనియు గ్రంథకర్త్రి వ్యక్తముచేయుచున్నది.

తొంటికాలమునఁబోలె మన దేశమున నాత్మాన్వేషణమునకు గౌరవములేని నేటికాలమున విశేషించి యీగ్రంథము హృదయపూర్వక స్వాగతమున కర్హమై యున్నది.

గ్రంథకర్త్రి మహాధీమంతురాలని శ్రీ జయపురాధీశ్వరులు ప్రవచించిరి. ఈ విషయమున నేను నిర్ణయమును జెప్పఁజాలకున్నను, సారాసార వివేచనమున నిపుణులగు శ్రీరాజాగారి యభిప్రాయమును బరమానందముతో నామోదించుచున్నాను.

"సర్ అల్లాడి కృష్ణస్వామి అయ్యరుగారికిని వ్రాసియున్నాను. మీపరాకాష్ఠయును బాండిత్యమును బరతత్త్వప్రకటనోత్సాహమును నామనంబున మిక్కిలి హత్తి పాయకున్నవి. అట్టులయ్యు మీగ్రంథమునకు మాత్ర మాంధ్రభాషాపాండిత్యమేకాక యార్యవిజ్ఞానమందు సానుభూతియుఁగల శ్రీజయపూరు మహారాజువంటివా రెవరైన నుపోద్ఘాతము వ్రాసిన మేలగును! మీ గ్రంథమునకు నితోధికశ్రేయమని నాయభిప్రాయము."

శ్రీ ర స్తు

క వి సా ర్వ భౌ మ

శ్రీపాద - కృష్ణమూర్తిశాస్త్రిగారిచే రచియింపబడిన

# "హంసవిజయనాటకవిమర్శనము"

---

కవితిలక కాంచనపల్లి కనకమ్మగారిని నేను కొన్ని సంవత్సరములనుండి యెఱుంగుదును. ఆమె యుభయభాషాప్రవీణయై చెన్నపురంబునందలి క్వీన్ మేరీకళాశాలలో నుపాధ్యాయిగా నుండుటయే గాక, విశ్వవిద్యాలయమున పరీక్షాధికారిణిగా వన్నెకెక్కియున్నది. మఱియు "జీవయాత్ర" లోనగు ననేకగ్రంథములు రచించిన కవయిత్రి. జీవయాత్రాగ్రంథములో నే నామెకవిత్వతత్త్వముం బురస్కరించుకొని కొన్నిపద్యములను వ్రాసియున్నాఁడ. సౌందర్యమహాలులో విశ్వదాత కాశీనాథుని నాగేశ్వరరావుపంతులుగారి యాధిపత్యమున నామెకు "కవితిలక" మనుబిరుదు నొసంగినసభలో నే నొక సభ్యుఁడనై నాయామోదముం దెలిపితిని. మఱియు ననేకసందర్భములలో నామెకవిత్వముంగూర్చి ప్రశంసించితిని.

ప్రకృతము హంసవిజయమువంటి వేదాంతగ్రంథమునకు వేదాంతవిద్యాపారంగతులు విమర్శనము వ్రాసిన నెంతయో సమంజసముగ నుండెడిది. అట్లుగాక మముబోంట్లు వ్రాయఁబూనుట సాహసమని చెప్పకతప్పదు.

అయినను నాకుఁగల స్వల్పానుభవముచేతను శాంత్యనుశాసనాశ్వమేధములు రచియించిన యభ్యాసముచేతను నిర్భయుఁడనై 'ఛిల్లికి ఛిల్లే, పల్లెకుఁ బల్లే' యనున్యాయముం బురస్కరించుకొని నాకుఁ

దోఁచినవిధంబున నాయభిప్రాయము వెల్లడించుచున్నాఁడను. ఇందలి నాహెచ్చుతగ్గులంగూర్చి తత్త్వవేత్తలు గర్హింపకుందురుగాక!

వేదాంతవిషయమును దృశ్యకావ్యముగ రచించుట మిక్కిలి కష్టము. తొల్లి కృష్ణమిశ్రుఁడు తనశిష్యుని బ్రబోధించుటకుఁ బ్రబోధ చంద్రోదయనాటకము నిర్మించుటలోఁదానెంత శ్రమనొందెనో వానికే తెలియును. అట్లే "హంసవిజయ"రచనయందలి కష్టము కవయిత్రికే తెలియఁదగును, గాని సామాన్యులకుఁ దెలియఁజాలదు.

ఈనాటకమునకు హంసవిజయ మని పేరు.

ఇందు కథానాయకుఁడగు నిరంజనుఁడు పరమేష్ఠివాహనంబగు హంస యగుటంజేసియుఁ బరమహంసస్వామిపరమోపదేశమే భాసురం బగుటంజేసియు నీనామముపరమోత్తమమై ప్రతిభావంతమగు. మఱియు హంసశబ్దశ్రవణముచేతనే వేదాంతార్థావబోధంబగుటంజేసియు నిందు వేదాంతవిషయము విశేషించియుండుటంజేసియు నిది పరమోత్కృష్ట మైనదని నాయభిప్రాయము.

## కథాసంగ్రహము

కల్యాణపురాధీశ్వరుండును కథానాయకుని తండ్రియునగు రాజశేఖరుండు సపరివారుండై తిరుపతి వేంకటేశ్వరుని దర్శనమునకై వెడలి స్వామినిదర్శించి తత్ క్షేత్రంబున కనతిదూరంబుననున్న జాబాలి తీర్థంబునందలి జయంతాశ్రమంబున బరమహంసస్వామి నాశ్రయించి తత్త్వోపదేశంబు వడసి స్వపురంబున కరుదెంచి తత్ప్రసాదంబునఁ బుత్రుంగాంచుట, పుత్రునకు నిరంజనుండను పేరుపెట్టి అక్షరాభ్యాసము చేసి యొకశాస్త్రియొద్దఁ బ్రాథమికవిద్య చెప్పించి పిదపఁ బరమహంస శిష్యుండగు సుశీలమునిసన్నిధానమున కంపి గురుకులవాసముం జేయించుట. పండితుండైన పుత్రునిఁ బట్టభద్రునిజేసి తాను వాన

ప్రస్థాశ్రమము స్వీకరించి సభార్యుండై పరమహంసస్వామి సన్నిధిం జేరుట. పట్టభద్రుండైన నిరంజనుఁడు తనవిద్యాభ్యాసకాలమున ఖండాంతరవిద్యాప్రభావ మెఱుంగఁగోరి పంపిన తనమిత్రుఁడైన యన్నంభట్టునకు బాసయిచ్చినమచ్చున తాను వివాహమాడనని పట్టుపట్టుట. ఇట్లుండఁ గొంతకాలమునకు తండ్రిచేసిన తత్త్వోపదేశంబున నెట్టకేలకు గృహస్థాశ్రమము స్వీకరింప నిశ్చయించుకొని చిన్నతనమునుండి తన్ను వరించిన తనమేనమామకూఁతురు బుద్ధిమతిని వివాహము చేసికొనుట, గురుకటాక్షమునఁ దనకు సంప్రాప్తమైన యణిమాదిసిద్ధులం బ్రసిద్ధిగాంచిన నిరంజనుఁడు తనవిద్యాభ్యాసకాలమున తానెఱింగియున్న శారద (సరస్వతీచూడామణి) సోమశిలా క్షేత్రంబున తపం బొనరించుచుండఁ దాను హంసరూపుఁడై యామె కడకుం జని యామెను గురుసన్నిధానమునకుఁ దత్త్వోపదేశమునకై తీసికొనివచ్చుట, ఆతడు తన బాల్యమిత్రుండైన యన్నంభట్టు విదేశములయందు నానావిధైహికమార్గనిరతుఁడై వైదిక ధర్మవిముఖుఁడై వచ్చినవాని గర్హించి తనతో నతని వివిధపుణ్యస్థలంబులకుం ద్రిప్పి స్వధర్మనిరతుం జేసి శారదచేఁ దత్త్వోపదేశంబు చేయించి తాను కృతకృత్యుండగుట.

## విషయసంగ్రహము

ఈకథ నేపెంచి ఐదంకములనాటకముగా రచించి యందు పెక్కుస్థలముల వేదాంతవిషయములును, నానావిధ ధర్మంబులును, భక్తిప్రపత్తులును, రాజనీతులును, విద్యావిధానములును లోనగునవి మనోహరముగాఁ గవయిత్రి వర్ణించియున్నది. నిరంజనుని వివాహఘట్టము శృంగారకరుణాద్భుతరసంబులతో విరాజిల్లుచున్నది. తీర్థయాత్రలు సేవించు నిరంజనుఁ డన్నంభట్టునకుఁ జేసిన జ్ఞానోపదేశఘట్టమును నతఁడు స్వధర్మనిరతుఁ డైనఘట్టమును చదివి యానందింపవలసి

యున్నది. నిరంజనుని ప్రథమవిద్యాభ్యాసకాలమందలి పండితచర్య స్వభావసిద్ధమై యిద్ధమై యున్నది. డామాఢోలీ పరిహాసోక్తులు స్తోత్ర పాత్రంబు లగుచున్నవి. ఇత్యాదులెన్నో విషయములు పేర్కొనవలసి యున్నను వానినెల్ల పాఠకులకేవిడిచి విశేషాంశమునకువచ్చుచున్నాఁడ.

## విశేషాంశములు:

నాందిలో సూత్రధారుఁడు ప్రజలను శాసించి ఆశీర్వదించినట్లు వ్రాయఁబడినది. వేదాంతనాటకప్రదర్శకుఁడట్టి శక్తిగలిగి తొలుత నట్టి యాశీర్వాదము చేయుటచే తన్నాటకౌత్కృష్ట్యమును వెల్లడించుచున్నది.నాంది యందువాక్యములే పదములుగా తీసికొనఁబడినవి. ఇం దష్ట పదములు గలవు. ఈసంఖ్య మనోవాగ్బుద్ధులతోడిపంచేంద్రియములఁ గోచరింపఁజేయుచున్నది. ఇవియేగదా జీవాత్మల కాధారమైనది. ఈ నాందిపద్యము షట్పాదములు గలదియగుట ఆధారాది షట్స్థానంబుల సూచించుచున్నది. ఆనందరాజశేఖరహంసాదిశబ్దములు కావ్యార్థమును సూచించుచున్నవి. అందు మనుజుఁడు బ్రహ్మానందభరితుఁడై శివానుగ్రహముగలిగినపుడే సోఽహంబ్రహ్మేత్యాకారకజ్ఞానము గలవాఁడగు నని వ్రాయఁబడినది. అందువలన నిరంజనుఁడు (పాపరహితుఁడు) అగును. ఇట్టితత్త్వము గ్రహించుటకుఁ బెక్కుపలుకులతోఁ బనిలేదు. సద్ధర్మకర్మములతో జీవయాత్ర నడుపుచు కర్మవాసనను లోలత్వమును విడిచి బ్రహ్మధ్యానము చేసినచో నోంకారముతోఁచి మనదేహమే దేవళమనియు జీవుఁడే దేవుఁడనియుఁ దోఁచును. అదియే పరబ్రహ్మధ్యానమై ముక్తిసాధనమగునని పద్యాభిప్రాయము.—

శ్రీశబ్ద మైశ్వర్యమాత్రద్యోతకము ఆనందమక్షయము పరమప్రాప్తికైన నాటకమున కనుగుణముగ నాంది యందు తొలుత నానందశబ్దము ప్రయోగింపబడినది. వాయుబీజమైన అకారము పద్యాదిని నిలుచుట ఖేదము నని లాక్షణికులు వ్రాసిరి.

మనకవయిత్రి అట్టిఖేదమోదముల సరకుఁగొనక అకారము పరబ్రహ్మార్థబోధక మగుటచేతను వాయుబీజ మగుటచేతను వాయు రూపుడైన జీవుఁడు పరమాత్మఁగలసి పరివర్తించునని సూచించుట కిట్లు ప్రయోగించెనని యెఱుంగునది.

వీరరసోచితము శరదృతువు. వేదాంతనాటకము శాంతరస ప్రధానము. అట్టి ఈనాటకమునందు శరదృతువువర్ణనము ఏల యని, స్థూలదృష్టిచే గొందఱనవచ్చును. సూక్ష్మదృష్టిచే విచారించినచో నీనాటకము వీరరసప్రధానమే? జ్ఞానాసిచే - నరిషడ్వర్గముతో నజ్ఞా నాంధకారమును ద్రుంచివేయుటయే ఈ రూపకఫలితముకావున శర దృతువు వర్ణనము తగియున్నదని పెద్దలూహింపకపోరు. ఇందుకు నిద ర్శనము "బ్రహ్మవిద్యకుఁ గావలసిన ధైర్యస్థైర్యములలో సగముండిన క్షాత్రమునకుఁజాలు" నను వాక్యమే చాలును. ఋతురూపకమై పరమహంసాదిపదములతోనున్న ఈవర్ణనము పరమార్థబోధకమై కావ్యార్థంబు సూచించుచున్నది:

ప్రస్తావన కడపటిపద్యమున "లయబ్రహ్మ" మనునది పర బ్రహ్మైక్యానుసంధానావబోధకము. ఇటఁ బాత్రప్రవేశ సూచనము చక్కఁగా చేయఁబడినది.

ఇందలి ప్రథమరంగము. విష్కంభమని యెఱుంగునది. ఈ విష్కంభమున బ్రహ్మవాహనమైన హంసయు సరస్వతీశిరోరత్న మును గథానాయకుఁడైన నిరంజనుఁడును యోగినియగు శారదగా భూలోకమున బుట్టిరని చెప్పఁబడినది. ఇట్లు విష్కంభముఖమున నీపూర్వకథనుఁ జెప్పక నాటకమునం దెక్కడనో సూచింపనొప్పును గాని, నిరంజనుఁ డెవఁడో శారద యెవతెయో తెలియమింజేసి విషయావబోధము చక్కఁగా కాదనియు ఆఖ్యాయికలవలెఁ దననాట కము సంశయగ్రస్తము కాకుండ నుండవలయు ననియు నభిప్రాయ

మున నీపూర్వవృత్తాంతము మొదటనే చెప్పఁబడిన శ్లాఘింపనై యున్నది. ఇందలి యితివృత్తము గల్పిత మగుటచే నిట్లు జెప్పుట సమంజస మనియే చెప్పనొప్పు.

ఈనాటకమున స్వధర్మానుష్ఠానమూలముగాఁ బరతత్త్వమును గ్రహించి జనుఁడు ముక్తుఁడగునని సూచించు విషయము లనేకములు గలవు. అందుఁ దీర్థయాత్రలు, దేవతారాధనము; గృహస్థాశ్రమము లోనగునవి ముఖ్యములు. కావుననే సకలధర్మములు తెలిసికొనఁగల విజ్ఞానము సంపాదింపఁ గలుగునని దెలుపుటకే తొలుదొల్త రాజశేఖరతీర్థయాత్ర వర్ణింపఁబడినది.

అఖండమండలాధిపతికన్న నిస్పృహుండై పరమేశ్వరధ్యానము సేయు యోగియే పరమోత్తముఁడని చెప్పుటకు "వాదమేలరాజీవా" యని పాడునట్టి భక్తుఁడు ప్రవేశపెట్టఁబడియే గురూపదేశము లేక పరతత్త్వావబోధ మగుట దుర్లభమని తెలుపుటకు బరమహంసాశ్రయము వర్ణితము.

బ్రహ్మజిజ్ఞాసకు ముందు సాధనచతుష్టయసంపత్తి కలిగించుకొనవలయును గాన దేవతాదర్శనములోనగునవి వర్ణింపఁబడినవి. గురువులైనవా రుండవలసినవిధియు వారివిజ్ఞానమును, శిష్యులను గృతార్థులను జేయువారినేర్పును పరమహంసస్వామివారిమూలమున వ్యక్తీకృతము.

ముక్తిమార్గమునకు తత్వజ్ఞానము ప్రధానమనియు తత్వజ్ఞానమునకు భక్తిశ్రద్ధలు మొదటివనియు భక్తిశ్రద్ధలకు గురుకులవాసమును సద్విద్యయుఁగావలయుననియు జ్ఞానావబోధకమగు వైదికవిద్యయే సద్విద్యయనియు నిందు విపులీకరింపఁబడియున్నది.

ఇందు శారద, విద్వాంసురాలై, కవయిత్రియై, సత్యసారమను గ్రంథము రచించినదని చెప్పుటచేత స్త్రీలు విద్యనేర్చి, కవయిత్రులై,

జీవన్మూక్తవంటి గ్రంథములు రచియించి, తత్త్వమెఱింగి తరింపఁగల రని సూచింపఁబడుచున్నది.

బ్రహ్మశాపసంజనితుండైన నిరంజనునకు భ్రాంతికలిగియున్న నని చెప్పుటకే, వివాహము సంఘసేవ కంతరాయమని కొంతకాలము వివాహమాడకుండినట్లును, విదేశవిద్యావ్యామోహము కలిగినట్లును వర్ణించుటయెగాక, బ్రహ్మశాపమైనను సద్గురుసేవవలనఁ దొలఁగిపోవు నని చెప్పుటకుఁ బరమహంసోపదేశమున విజ్ఞానము కలిగినట్లును వర్ణింపఁబడినది.

ఈగ్రంథమున నాందిలో "మీకేలవాచానైపుణ్యము" అని చెప్పినదానికి సరిపడునట్లు చతుర్థాంకములో

క. వ్యాసముల వ్రాసితిని పలు
బాసల నేర్చితిని శాంతి భాష్యంబులకేఁ
జేసితి, డాసితి ప్రముఖుల
పీసము ముద మొదవ దీప్రవృత్తుల నెందున్.

అనుపద్యము శారదచెప్పినట్టు లెంతచదివినను నెంత వాచానైపుణ్య మున్నను, విజ్ఞానములేమి జనుఁడు జడత్వంబు నొందియుండునని చెప్పుచు, శారద మంచివాచానైపుణ్యము కలదియైనను గురుసేవ లేమింజేసి జడత్వమొందియున్నదని బ్రహ్మశాపము సూచింపఁబడినది. ఆన్వీక్షిక్యాది నానావిధ నీతికోవిదుండగు సుదర్శనమంత్రి మంత్రా లోచనము, శాస్త్రసమ్మతముగాఁ బేర్కొనఁబడినది.

సాధుదర్శనము సమస్తదోషాపహమని చెప్పుటకు భ్రాంత్యా త్ముఁడైన నిరంజనుఁడు పరమహంసదర్శనమాత్రముననే

చ. మునివర! నిర్గనంగవిడెఁ బోముడి డెందమునందుఁ బ్రీతిమ
జ్జనకునిబోలె నన్నును వశంవదుఁగాఁగ నను గ్రహించి నా

జననము ధన్యమౌనటు ప్రశాంతపథంబున నిల్పుమయ్య నా
దని యిఁకలే దొకింతయిదె యాత్మసమర్పణ నీకుఁ జేసితిన్.
అని యాత్మార్పణము చేసికొనినట్లు కల్పింపఁబడినది.

లోకమునఁ జిరవాంఛితంబె నాటికేని భగవ దనుగ్రహ మున్నచో ననాయాసముగ సిద్ధించుననియు, నట్టిసిద్ధికిఁ దపంబు మూల మనియుఁ జెప్పుటకు నిందు నిరఁజనునిఁ బెండ్లియాడ నెంచిన బుద్ధిమతిచరిత్రము సాక్ష్య మిచ్చుచున్నది.

బుద్ధిమతి విరహారూప స్మరణ మననాదికము, గీతగోవింద స్తుతియుఁ దాదాత్మ్యప్రాప్తియు నిం దతిమనోహరముగ వర్ణింపఁబడి యున్నవి.

ఇది భక్తిరసప్రధాన వేదాంతార్థావబోధక గ్రంథమైనను నీపద్ధతిగ నెల్లరసములను గలిఁగియుండుట నాటకలక్షణము గావునఁ బరమార్థావబోధక శృంగార మిట వర్ణింపఁబడినది. అది శుకముఖం బున వ్యక్తీకరించుట యపూర్వపర్వముగా నున్నది.

శారదయు నిరంజనుండును "జ్ఞానప్రదాతలై లోకమునకు మహోపకారము నేయంగలరు" అను బ్రహ్మవాక్యము ననుసరించి, నిరంజనుఁడు పరమమూర్ఖుఁడైన యన్నంభట్టునకు జ్ఞానోపదేశంబు చేసి సన్మార్గప్రవర్తకునిగాఁ జేసెను. ఇట్లు చెప్పుటచే నెట్టినికృష్టుఁడైన సదుపదేశముకలిగినచో శిష్టుఁడుగా మారఁగలఁడని సూచింపఁబడినది.

ఎంతవానప్రస్థాశ్రమమున గురుసేవ చేయుచున్నను గన్నవారి కెంతోకాలమునకుఁగాని పుత్రమోహముతీరనిదియే యగునని తెలియఁ జెప్పుటకుఁగాఁబోలు పరమహంసుని సేవించుధర్మాంబ తనకొడుకు వివాహము చేసికొనలే దనువిచారమున నున్నట్లు నిరూపించుట సహజ గుణమును వెల్లడించుచున్నది.

శ్రీమంతుండై యింతగొప్పపదమందుండి కన్నుగానకున్నను మహాత్ములదర్శనమున సజ్జనుండై, వినీతుండై, నిరభిమానివై తన పదమును దృణముగానెంచుననుటకు రామిరెడ్డి తార్కాణఁజేయఁబడెను.

## సారాంశము

పరమహంసను వర్ణించుటలో వేంకటేశ్వరునికన్న వేయిమడుంగు లధికుఁడని చెప్పినవిషయ మతిహృద్యముగానున్నది.

రాజశేఖరుఁడు పరమహంసదర్శనము చేసినపట్లసంభాషణము సముచితము.

మంత్రిసహితుఁడైన రాజశేఖరునిసభలోఁ బండితసమక్షమున జరిగిన విద్యావిషయిక చర్చ సర్వదాస్మరణీయము "దేవుఁడాయెందున్నవాఁడుర జీవుఁడు" అను డామాడోలీ పాటయు, వానిమాటయు ముద్దులుమూటగట్టుచు వాని మేటితనమును చాటుచున్నవి.

కలవాణికి నాతఁడు చెప్పినమాటలును వానిచేతలును నతని కౌశలమును వెల్లడించును. సుశీలునియొద్ద విద్యాభ్యాసముచేయు నిరంజనునకు శారదారచితమయిన సత్యసారమను గ్రంథమందలి

"సర్వసంశయములు సమసిపోయెడుదాఁక
కోరు దానిమనము చేరుదాఁక
వాసనాత్రయంబు వాడిపోయెడు దాఁక
భవముదాఁటుదాఁక వ్రతము తపము."

ఇత్యాది పద్యముల మూలమున శారదను తెలిసికొనునట్లు చేయుట మిక్కిలి సమంజసముగ నున్నది.

నిరంజనుని రాజ్యపరిపాలనాదికము వర్ణించుచు రాజధర్మోచిత వ్యాపార మభివర్ణించుట ముదావహము.

మంత్రికిని రాజకుమారునకును జరిగిన వివాహవిషయమైన సంవాదము సంస్తవనీయము. విదేశాచారముల మునిగిన యన్నం భట్టుచే

గీ. క్షోణిపతులను దమకు శిష్యులుగఁ జేసి
మానమభిమానముడిపి సన్మానవృత్తి
బ్రాహ్మణోత్తములకు నెప్డు బలమొసంగ
జాలినదిజో లె త్యాగధ్వజంబు వోలె.

అనుపద్యము చదివించి నిరహంకారునిగాఁ జేయుపట్లఁ జెప్పిన నిరంజనుని సూక్తులు పునఃపునః పఠనీయములు.

## విమర్శనము

కనకమ్మగారి కవిత్వము నాతికఠిన మ్మృదుమధురమని నేను వేఱచెప్పనక్కఱలేదు. ఈనాటకరచనయే యద్దానిని శతథాసహస్రథా ఘోషించుచున్నది. ఈనాటకమందు సమయోచితాచారముగా ననేకవిషయములు వర్ణించుచు నాధునికాచారములకన్న మన పూర్వాచారములే సర్వోత్తమములని చెప్పునంశములు పెక్కులు చూపట్టుచున్నవి. ఎన్నియాచారము లెన్నెన్నిచోట్లఁ జెప్పుచువచ్చినను దుదకుఁ దత్త్వజ్ఞానమే కావలయునని తేల్చుచు ననేకస్థలముల వేదాంతవిషయకోపన్యాసములు చేయుచు జ్ఞానామృతమును వర్షించిన కనకమ్మగారి ఘనత వేనోళ్లఁ బొగడనైయున్నది. ప్రతిపద్యరసాస్వదంబగు నీనాటకముం జదివియానందింపని యాంధ్రుఁడుండఁడని నానమ్మకము. నేనీగ్రంథమునకుమంచి యవతారికను వ్రాయనెంచితినిగాని, కార్యాంతరవ్యగ్రుఁడనై ఆమయగ్రస్తుఁడనై యుండుటం జేసి యనుకొనినట్లు వ్రాయఁజాలక యిట్లు వ్రాసితిని. శైలిజూపుటకు,

క. ఆడించితి పాడించితి
వేఁడించితి వేసములను వేయించితి నట

జోడించితి నీభక్తుల
తోడన్ నీతోడఁ బ్రీతితోడన్ నృహరీ.

ఉ. నాటికి నేటికిన్ బరమనాస్తికబుద్ధి యొకండు సూటిగా
నాకు హృదంతరాళమున నాగతి యింకెటు తెల్లవార్చెదో
కైటభవైరి! జీవులకుఁ గారణభూతుఁడ వీవ యయ్యునా
బోఁటులనేల? యివ్విధిని మూఢులఁ జేసి రమింతు వింతగాన్.

మ. పరులన్ వేడుటకన్న వేఱొకలదా పాపంబు సద్భక్తులన్
హరినిన్ బాడుటకన్న నొండుకలదా యానంద ముద్యోగమున్
గురుసూక్తిన్ భజియింపుచున్ బుధులతో గోష్ఠీవినోదంబులన్
దరియింపంగల పుణ్యపూరుషుల చెంతన్ దాసినిన్ ధన్యనున్.

క. నతిఁ జేసితి నుతిఁ జేసితి
గతినీవని వేడుకొంటిఁ గాళ్లం గడుపున్
సతతంబు భక్తిఁ బట్టుచు
బతిమాలితి నంతలోన బ్రహ్మంబయితిన్.

సీ. పథ్యాలఁ బెట్టి నిర్బంధించు టదిచూడ
సర్వభక్షుణ సేయు శక్తికొఱకె
మంత్రదీక్షలును సన్మాననసబోధలు
మఱుమాటలేని సమాధికొఱకె
విధినిషేధములందు వేదముల్ నిల్పు ని
స్త్రైగుణ్యమైన పథంబుకొఱకె
అతిథిపూజాది గృహాశ్రమక్లేశమ్ము
లవధూతఁ గాగాంచు హాయికొఱకె

గీ. ఆర్యధర్మంబు స్వైరవిహారముడిపి
నియమమున నిల్పి క్రమముగా నిజము తెల్పి
వాసనలఁ బెంచి త్రుంచుచు బలమొసంగి
యంతటను నిల్పుఁ బ్రీతి బ్రహ్మానుభూతి.

# పరిచయవాక్యము

ఆత్మవిజయము - హంసవిజయము - జీవయాత్రకు పరమార్థము.
జీవయాత్రకు ధర్మము బీజము; అర్థము, కామము కీలకము; మోక్షము శక్తి. జీవయాత్రకు సుఖప్రాప్తి, దుఃఖనివృత్తి పరమార్థము. జీవయాత్రకు పరమార్థమైన సచ్చిదానందానుభవమునకు వేదవేదాంగములు, కళాశాస్త్రములు, కావ్యనాటకములు, పురాణేతిహాసములు, మంత్రతంత్రములు, శ్రీవిద్య మహావిద్యలు, సాంఖ్యయోగములు, భక్తివైరాగ్యములు, త్యాగసన్న్యాసములు, ఆగమాచారములు, సంప్రదాయ వ్యవహారములు మొదలగు సకలధర్మార్థకామములును సాధనములు. జీవుడు, జీవయాత్రను సచ్చిదానందానుభవమైన దేవయాత్రను జేయుటకు, మతములు, యోగములు, యాగములు, స్తోత్రములు, కర్మలు, ధర్మములు సాధనములు. అవతారపురుషులు, మహర్షులు, మునులు, యోగులు, కవులు, పండితులు, తత్త్వజ్ఞులు, వీరులు, ధీరులు, భక్తులు, పరమహంసలు జీవయాత్రను దేవయాత్రను జేయుటకు భజించిన పరమార్థసాధనములందు వేదాంతముత్తమసాధనము. పురుషార్థమునకు సకలార్థసాధనములను సమన్వయము చేసిన వేదాంతము జిజ్ఞాసువులకు శ్రోతవ్యము, జ్ఞాతవ్యము, మంతవ్యము. శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు వర్తమానకాలమునందు పరిహాసపాత్రముగ నున్న వేదాంతసారమును దృశ్యప్రబంధముగను రచియించుట సంస్తవనీయము. గురుపారంపర్యలబ్ధమైన ఆత్మజ్ఞానానుభవపూర్వకమైన వేదాంతము సుకృతము. అమృతానంద

స్వామి బోధామృతమైన హంసవిజయ మీసుకృతార్థమును మనోహరముగను దెలుపుచున్నది.

భరతవర్షమునందు వేదాంతరహస్యములు గురుపరంపరాగతములు. అనంతమైన యోగములను, కర్మలను, దర్శనములను, ధర్మములను సంశయరహితముగ నుపదేశించుటకు గురువులు సమర్థులు. ఆదికాలమునుండియును గురుశిష్య పరంపరాగతమైన సనాతన వేదాంతవిజ్ఞానమును గురుశిష్యపరంపరలు రక్షించుచు బోధించుచున్న విధమును గురుకులపీఠములు వెల్లడిచేయుచున్నవి. హంసవిజయము సనాతనగురుపీఠములను, సాధనములను, వేదాంతవిజ్ఞానమును, గురుకుల విద్యావిధానమును, వర్ణాశ్రమసదాచారములను సమర్థించి రక్షింపవలసిన యవసరమార్గములను రూపకముఖమునను వెల్లడిచేయుచున్నది. అన్నంభట్టు కర్మపరిపక్వానంతరము నిరంజనునకు దెలిపినభావ మిందులకు ప్రమాణము:—

సీ. కలవిశ్వ మంతటఁ గర్మార్హ మైనట్టి మర్త్యలోకంబె సన్మాన్య మందుఁ
దత్త్వాంశ మైయున్న ధరణికిఁ బెనుదివ్వె గా నెల్గు భారతఖండ మందు
నధ్యాత్మవిదులు సదాచారఘనులచే దీపించు నీయాంధ్రదేశ మందుఁ
గలినాయకుండు వేంకటనాథుఁ డుండు సద్ధామంబు శేషభూధరమునందు

గీ. భోగిరాడ్వ్యాఘ్రశాంచితమ్మను దిరుమల, శ్రీనివాస త్రిలింగాభిధాన పీఠ
మిది మహావిద్యఁ గాంక్షించువెల్ల భక్త, వరులు సేవింపఁ దగినట్టి పరమపదము.

ఈపద్యభావమునె వేరొకవిధమునను పరమహంస అన్నంభట్టునకు దెలిపిన నిరంజనశారదల పూర్వోదంతమును విశదము చేయుచున్నది :—

ఇ మ్మహానుభావ శారద పూర్వభవంబున సరస్వతీదేవి చూడామణి బ్రహ్మశాపవశంబున స్వస్థానమునుండి చ్యుతిగలిగి మహాత్మేవాపుణ్యవిశేషంబున, భూలోకంబున, నీయాంధ్రదేశంబునఁ బినాకినీతీరంబున, సోమశిలాక్షేత్రంబున, నయోనిజగా జన్మించి, బాల్యంబుననే సకలకళావిశారదయై, మహాయోగినియై,

కవయిత్రియై, బుధమనస్సంతోషదాత్రియై యుండియుఁ దనమనంబున శాంతిలేనిదై, సద్గురుకటాక్షభాగ్యమునఁగాక యాకొఱఁత తీరదని నిశ్చయించి, తద్దర్శనార్థినియై, తీవ్రవేదనపడుచు, దైవికముగ హంసోపనీతయై మాసన్నిధి కరుగుదెంచి మాచేఁ దత్త్వోపదేశంబు గాంచి పరిపూర్ణురాలై యాశ్రితాళి ననుగ్రహింపఁజాలినది.

మహారాజకుమారుం డగు నీ నిరంజనుండును బూర్వభవంబున బ్రహ్మవాహనమైన హంసగ నుండి, శాపవశంబునఁ జూడామణివలెనే స్వస్థానముననుండి చ్యుతుండై యీ రాజశేఖరరాజర్షి తనయుండై, సకలకళాచతురుఁడయ్యుఁ, గాలవశంబునఁ గొంతకాలము భ్రాంతిందగులుకొని, దైవవశంబున నస్మత్సన్నిధానంబున కరుదెంచి, మన్నియోగంబునఁ దనతండ్రియొద్దఁ దత్త్వజ్ఞానోపదేశమువడసి, పూర్ణుండై, యనురూపయైన సాధ్వీమణినిం బెండ్లియాడి, గృహిణీసమేతంబుగఁ దీర్థయాత్రలు నిష్ఠఁగూడిసేయుచుఁ దనకుఁ గలిగిన యోగసిద్ధిబలంబునఁ గామరూపుఁడై హంసగవచ్చి యీ శారదాదేవిని మాయాశ్రమంబునకుఁ జేర్చి, యదృశ్యుండై మరల నిరంజనుఁడై మిగిలియున్న యాత్రలఁ బూర్తిచేసికొని యిటువచ్చుట విదితమే కదా!

గీ. సరసిజాక్షుండు తన్నెప్డు కరుణఁజూడ, సకల సకలకలాప విస్తారగరిమ
నామసార్థక్యమునకునై భూమిలోన, శారదాపీఠమును నిల్పు శారదాంబ.

శ్రీమతి కాంచనపల్లి కనకాంబగారు గురుకులాశ్రమమునందు శ్రీ అమృతానందస్వామి గురూపదేశమునను, స్వాత్మానుభవమునను సాధించిన వేదాంతవిజ్ఞానమును జీవయాత్రయందు వలెనే హంసవిజయమునందును పరిస్ఫుటము చేసి ఆంధ్ర సాహిత్యమునకును, వేదాంతమునకును, గురువర్యులకును, సహచరులకును మహోపకారమును జేసిరి. సకలజీవములకును జీవయాత్రను పరబ్రహ్మయాత్రను జేయుట పరమపురుషార్థము. సత్యలోకవాసులైన హంసచూడామణులకువలెను భూలోకవాసులైన నిరంజనశారదలకును కర్మానుభవము పరమార్థసిద్ధికి సాధనము. జీవయాత్రయం దజ్ఞానము బంధమునకును, జ్ఞానము మోక్షమునకును మూలములు. అజ్ఞానమును బోగొట్టి జ్ఞానమును గలుగజేయుటకు వేదాంత ముత్తమసాధనము. నాందియందు సూచించినవిధమునను

సాధక సాధన సాధ్యములు జీవయాత్రయందు హంసవిజయరూపపరి ణామమును పొందగలవిధమును హంసవిజయరూపకమునందలి

శా. ఆనందంబున రాజశేఖరుకృపన్ హంసశ్శివస్సోహ మన్
ధ్యానం బున్న నిరంజనుండె యను సత్యం బిద్ది మీ కేల వా
చానై పుణ్యము జీవయాత్ర నడుపన్ సద్ధర్మమున్ బూనుడీ
నానాజన్మజవాసనల్ విడువుడీ నారాయణుం గొల్వుడీ
లోనోంకారము శారదాకృతియ మీలోలత్వముం బాసినన్
మేనే దేవళ మంచు దెల్పు గురుడే మి మ్మెల్లరన్ బ్రోచుతన్.

పై పద్యమునందలి భావార్థములు విశదము చేయుచున్నవి.

అవ్యక్తమైన పరమాత్మ ఆత్మస్వరూపమునను సువ్యక్తము గాగలవిధమును హంసవిజయమునందలి పరమహంస, రాజహంస, హంసాదుల జీవయాత్రోదంతములు హృద్యముగను బోధించు చున్నవి. గురూపదేశమునను "హంసశ్శివస్సోహమ్" మంత్రోపాసన సాధనమునను సాధకులు నిరంజనులు కాగలవిధమును హంసవిజయము బోధించుచున్నది. జీవుడు అజ్ఞానమును విడిచినపుడు సనాతనుడైన దేవుడయి "హంసశ్శివః శివోహమ్"మంత్రార్థము సార్థకమగుచున్నది.

ఆత్మవిజయమున కభిమానము మూలప్రతిబంధకము. అన్నంభట్టు, రామిరెడ్డి, మాలిని, జడ్జి మొదలగుపాత్రలకు వయోరూప ధనాధికారపాండిత్యాభిమానములు పురుషార్థమునకు ప్రతిబంధకము లైనవిధమును హంసవిజయము బోధించుచున్నది. సకలకాల సకలావస్థ లందును జీవునకు జీవయాత్రయం దాత్మవిజయసాక్షాత్కారానందముల కవకాశములు గలవు అపరోక్షానుభవమున కనంతసాధనము లున్నను అనుభవజ్ఞులైన గురువుల యుపదేశము లుత్తమసాధనములు.

శ్లో. స్వవర్ణాశ్రమధర్మేణ తపసా హరితోషణాత్,
సాధనం ప్రభవేత్ పుంసాం వైరాగ్యాదిచతుష్టయమ్.

స్వవర్ణాశ్రమ ధర్మాచారముల నారాధించుట పురుషార్థసిద్ధికి సులభసాధనము. వర్ణాశ్రమాచారధర్మములు నిరాశ్రయములైన సమయమునందు వర్ణాశ్రమాచారధర్మముల ప్రపత్తిని నుద్ధరించవలసిన యవసరమును హంసవిజయము బోధించుచున్నది.

మ. ఘోరస్వప్నము గాంచి జీవుఁడటు మేల్కాన్నట్టు లజ్ఞుండు తా
ఘోరాఘంబుల సల్పిసల్పి మది సంకోచంబులన్ వీడ స
ద్వైరాగ్యంబున బ్రహ్మ మట్లచలుఁడై స్వస్వామిసద్యోగ వి
ద్యారామత్వము తత్త్వమై తనర నాత్మార్థంబు వర్ధిల్లెడున్.

ప్రపంచవ్యాప్తమైన పురాణనవీనసంస్కారసంరంభమునందు జీవయాత్రకు పరమార్థమును గ్రహించుట దుర్లభముగ నున్నది. హంసవిజయము పరతత్త్వోపదేశమును సనాతనధర్మమార్గమునను జేయుచు వర్తమానసంధిసమయమునందు సందేహరహితమైన యోగ సాధనమును బోధించుచున్నది. కర్మయోగమునకును, సన్న్యాసయోగ మునకును సంయోగసమన్వయ మత్యంతావసరము. హంసవిజయము నందలి విద్యావిధానాదిచర్చ లీవిషయమును స్ఫురింపజేయుచున్నవి. పరమహంసలు, రాజహంసలు, హంసలు "ఆనందః ఆనందః ఆనందో బ్రహ్మ! బ్రహ్మానందః" అని పరతత్త్వమును స్మరించుచు జీవయాత్రను కేవలము దేహయాత్రకు గాకను దేవయాత్రకు వినియోగింపవలసిన యవసరమును, సాధనవిధానములను హంసవిజయము సనాతనసంప్ర దాయాచారమార్గమునను, సులభముగను బోధించుచున్నది.

సీ. ఆశ్రమంబులు నాల్గు నామ్నాయవిధిఁ బ్రోవ హంస యిచ్చట రాజహంస యచట
ధర్మసూక్ష్మము స్థూలధర్మంబుఁ గఱపంగ హంస యిచ్చట రాజహంస యచట
మణికాంతి శ్రీశిరోమణికాంతి యట రాజహంసంబు దీపించు హంస యిచటఁ
దంత్రశక్తిని మహామంత్రశక్తిని రాజహంస యచ్చట నిల్చు హంస యిచటఁ

గీ. బంచుకొనినట్టులుండి రాయంచమణియుఁ, దత్తదుచితంబుగాఁ గూర్చుధర్మము లొగి
నచట నిచటను-రాజ్యమం దంత నౌర, కర్మభూమినిఁ బుట్టుజిజ్ఞాసువులకు.

బ్రహ్మవిద్య విద్యల కెల్ల రాజవిద్య. ప్రాచీనకాలముననుండి యును భరతవర్షము బ్రహ్మవేత్తలకు నిలయము. ప్రాచీనకాలము నందు మైత్రేయీ సులభాదులవలెను వర్తమానకాలమునందును బ్రహ్మజ్ఞానసంపన్న లయిన కనకాంబా శారదాంబలు వేదాంతవిజ్ఞాన మును వ్యాపింపజేయుటకు దీక్షను బూనుట సంస్తవనీయము. శ్రీ సద్గురుకటాక్షమునను కనకాంబారాధ్యమైన శారదాపీఠమును వర్ధిలుగాత !

శ్రీమతి కనకాంబగారి స్వీయచరిత్రము "ఉద్ధరేదాత్మనాత్మానం" అనెడి భగవద్గీతోపదేశమునకు సుందరవ్యాఖ్యానము. మానవులకు బంధమోక్షములు వారిహస్తములందే కలవు. స్వీయసంకల్పసత్త్వాను రూపముగను ఫలము గలుగుచుండును. బాల్యమునుండియును కన కాంబగారు చేసిన శారదోపాసనకు హంసవిజయము వరప్రసాదము. సంకల్పసామర్థ్యము గల మానవు లందరును జీవయాత్రను ఆత్మయా త్రను జేయగలవిధమును కనకాంబగారి కృతులు వెల్లడిచేయు చున్నవి. హంసవిజయము జీవయాత్ర కనుబంధగ్రంథము. శ్రీ గురు బోధసంకల్పమును, స్వాత్మానుభవమును, సహచరసాంగత్యసంభాషణ లను సార్థకముచేయుట కీయనుబంధరూపకము రచియింపబడినది. శ్రీ విక్రమదేవవర్మమహారాజుగారు వారి వక్తవ్యమునందు శ్రీ కన కాంబగారి హంసవిజయము విషయమైన సమగ్రవిమర్శనమును వ్రాసియుండిరి. సర్ రాధాకృష్ణపండితుడును తొలిపలుకునం దాత్మా న్వేషణావసరమును, కనకాంబగారి పాండిత్యమును ప్రశంసించిరి. శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు సమగ్రవిమర్శనమును వ్రాసిరి. హంసవిజయమునకు పరిచయవాక్యములను వ్రాయుటకు నాకును నవ కాశమును గలుగజేసినందులకు శ్రీమతి కనకాంబగారికి కృతజ్ఞుడను.

సందర్భానుసారముగ నుదాహృతములైనహంసవిజయ గద్యపద్య ములు కనకాంబగారిరచనాసామర్థ్యమునకును, సరళభావములకును,

కనుకూలముగా నన్నివర్ణములవారిచే వేదపఠనంబు సేయించు గురుకులంబును జూచితిని. పాశ్చాత్యవిద్యా విధానంబున లేదని శాంతికై నెలకొల్పఁబడిన నికేతనంబులనుఁ గాంచితిని. పరాసుమాతృకాముఖంబున నాశ్రితుల ననుగ్రహించువారి ఘోషంబుల నాలకించితిని. అమరత్వసిద్ధి కలిగింతుమని పెద్దసంఘము నాకర్షించియుఁ గాలవశతనొందిన స్వాములఁ దిలకించితిని. నిమ్నజాతుల నుద్ధరించు కులపతుల యాశయంబు లరసితిని. కర్మాగారములు నెలకొల్పి చేతిపనులు కల్పించియుఁ, బాలు, పెరుగు, వెన్నల నమ్మించియు నాశ్రితులకు జీవనోపాయముల కల్పించి ధనముకూర్చుకొని సకలప్రాంతముల నుండి శిష్యగ్రహణముసేయు దయాళువుల బాగోగుల విచారించితిని. బహుజన్మవృత్తాంతములఁ దెలుపుచు భారతవిజ్ఞానంబు నుపదేశముసేయుటకై ప్రాచీనఋషులఁ బాశ్చాత్యకాయంబుల గుర్తించుచు సకలదేశవాసులకు దివ్యమైన జ్ఞానమును బ్రకటించు గోష్ఠులను జొచ్చి చూచితిని. జాతీయకళాశాలల ప్రశంసలు వింటిని. హైందవజాతీయత నిలువఁబెట్టుటకై పండితులు నిర్మించిన విశ్వవిద్యాలయముల జాడలఁ గాంచితిని.

చెట్టుపేరుచెప్పి పండ్లనమ్మినట్లు మహనీయునిపేరును, విగ్రహమును గ్రహించి వారి బోధనములను బ్రకటించి సొమ్ముచేసికొనుచు గురువులను మించి సవరించుచు, నపరిపక్వమైన సాహసులకు నుత్తమాశ్రమంబు నొసంగుచు విధినిషేధంబుల నుల్లంఘించుటకు మిషను కల్పించుకొని రామ, కృష్ణ, గోవింద యనుకొను భక్తుల యుత్సాహములఁ జూచితిని. ఇవియన్నియు భారతవిజ్ఞానమునకై యేర్పడిన సంస్థలే. ఇవిగాక రాయల్ ఏషియాటిక్ సంఘమువారి ప్రకటనలను జదివితిని.

శర్మ—మహాప్రభూ! ఆర్యులారా! దాసుగారిపక్షము కేవలప్రాచీనప్రాగ్దేశవిజ్ఞానమునకు విరోధము. పంతులగారికిని, వర్మగారికిని నార్యవిజ్ఞానముపై నభిమానము లేదని నేనుఁ జెప్పఁజాలను. కాని యొక్క మాట. వాస్తవస్వరూపము, సారస్వతోపాసనము సద్గురూపాస్తిచేఁ దెలిసికొను సచ్ఛిష్యులకు బోధపడునే కాని తదితరులకు బోధపడదు. పంతులుగారికిని వర్మగారికినిగూడ సంస్కృతభాషాపరిచయము కలిగించుకొనుట కవకాశము కలుఁగలేదు. అభిమానముచొప్పున వారు భాషాంతరీకరణముల ద్వారా పూర్వగ్రంథాంశములను జదువ నుద్యమించినను గ్రంథభాండాగార పరిశోధనములతో సత్యము తేలదు.

క. గురుజనముల సేవింపక
పరమార్థముకొఱకు గ్రంథభాండాగారం

బరయుట వీణె మృదంగముఁ
గర మర్థించెడుఁ గతిగద గానంబునకై.

జీవితముయొక్క పరమప్రయోజనము మహారాజుగారు సూచించియున్నారు. "శాస్త్రస్యాపి పరమప్రయోజనం మోక్షః" అని యున్నది కదా. అఖండానంద ప్రాప్తియే పరమార్థమని మనపెద్దలు సిద్ధాంతీకరించినారు. అనిర్దిష్ట పరమప్రయోజనము కల పాశ్చాత్యదేశములయందు మానవుఁడు చిత్తశాంతిలేమి నల్లాడుచున్నాఁడు. ఆనవ నాగరికదేశంబులం దెచ్చట చొచ్చిచూచినను దుపాకిమందుకంపు కొట్టుచున్నదే కాని తపించు మానవహృదయమును జల్లఁబడఁజేయు నుపాయముగాని, శాస్త్రముగాని, బోధముగాని, యిప్పటికిఁ గానరాదు; కానవచ్చు నాశయుఁ దోఁచుటలేదు. ధర్మరహితములైన యర్థకామములఁ దగులుటచే నాగరికదేశములందు నాశాభయములకు లోనై రాగద్వేషవశులపాలై సంఘము లన్యోన్యము సమరం బొనర్చుకొనుచు నాకసమందు, భూమియందు, సముద్రమునందు నన్యోన్యమారక ప్రయోగంబులు గావించుకొనుచుఁ గామవశులై, ధర్మబాహ్యులై, స్వచ్ఛంద ప్రణయప్రవాహమునఁ బడి భగ్నహృదయులై యాలుమగ లన్యోన్యపరిత్యాగములఁ గావించుకొనుచు, నాత్మహత్యలపాలగుచున్నారు.

ధర్మాచరణముచే లోకమర్యాదలు నిలిచి సంఘమునకు సౌఖ్యము కలుగును. మోక్షముచే నాత్మానందము కలుగును. అర్థము జీవనమునకు, రక్షణమునకు నావశ్యకము. కామము జీవులకు సహజప్రవృత్తి. ఇట్టి యర్థకామములను ధర్మానుగుణముగ నడిపించి మోక్షము సాధించిన యార్యులపద్ధతియందు కేవల మర్థకామంబులకైన ప్రవృత్తి గ్రహింపఁదగినదికాదు.

ఆధునికకాలమందు విజ్ఞానవ్యాపనమునకై నెలకొల్పఁబడిన ప్రతిష్ఠాపనముల నన్నింటి సింహావలోకనంబు సేయుచు డామాడొలీశాస్త్రిగారుచేసిన యుపన్యాసము వింటిరిగదా! వినుండు.

ద్వా. 1 అన్నింటిలో మంచి యరయుచుండెడివి
కొన్నిమతంబులు క్రొత్తగాఁ బుట్టె

2 ఇష్టమైనట్టుల నిల నాచరింప
దుష్టుల కవి గొప్పదోహదా లయ్యె

3 మంచిముక్కోకరిది మంచిది కన్ను
నెంచి మఱొక్కరి దేకంబుఁజేసి

4 మంచివిగ్రహమంచు మహి నెవ్వఁడేఁ ద
లంచిపూజించు నాలంపటుం డగుచు

5 విషయంబులందున వేడుక హెచ్చ
ఋషివలెఁ గాన్పింప నీమతం బరయు

6 మంచివన్నియు నేరి మహి నొక్కచోట
నుంచుట నెరుగఁడే యూహింప నజుఁడు.

"బెజ్జము," "రంధ్రము" నను రెండుశబ్దములను జేర్చి బెంద్రమందురు, కుటుంబము, సంసారమును జేర్చి కుటుంబరమందురు. శిష్టులవలె మాటలాడ యత్నించు ప్రాకృతులపాటు లివ్వి. స్వదేశవస్త్రములతో విదేశస్థుల యుడుపులఁ బోలె లాగులు, నంగీలు కుట్టించుకొందురు. ఇది దేశాభిమానుల మనుకొనువారి యవస్థ. ఇంకఁ బ్రతిష్ఠాపరుల విషయ మొక్కమాట.

ద్వంద్వాతీతులు కాఁజాలనివారు, సమరసభావము కుదురనివారు, అహంకారమే ప్రధానలక్షణముగాఁ గలవారు, సద్గురుసేవఁ జేయఁజాలనివారు తమ చిన్నబుద్ధికిఁ దోఁచిన సందేహములనుబట్టి శాస్త్రములక్షణమనుటకు నుత్సహించుచు శిష్టకృత వ్యాఖ్యాన మపేక్షింపనివారు, గీర్వాణభాషా ప్రవీణత లేనివారు, తాము నిరభిమానముగ సద్గురుసేవ సేయనివా రగుటచేఁ దమ శిష్యులనుగూడ తాము చక్కగ శిక్షింపక బుజ్జగించి గురుత్వమును నిలుపుకొనువారును, దేశాభిమానావేశముతో దేశసేవయుభాషాసేవయు నిక్కముగఁ జేయుచున్నా మనునమ్మకముతోఁ బ్రారంభించి పట్టుదలతో నడుపుచున్న వీరిప్రతిష్ఠాపనలు తత్త్వశూన్యము లగుట సహృదయులు వీనిని మెచ్చరు. పాఠ్యప్రణాళిక నాయకులకే తెలియదు.

తమకంటె పెద్దలైనవారి సన్నిధియందు వినయవిధేయతలతో "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" అన్నటుల సంచరించి సంప్రదాయకులు పూర్ణులై మున్నధీతిబోధాచరణ ప్రచారములఁ గావించిరి.

డామా—ఇప్పటి నాయకు లక్కడక్కడఁ బ్రోగుచేసికొన్న విషయములకుఁ దమ యూహలు తోడుచేసి తమకంటెఁ జిన్నలైనవారి నాకర్షించుకొని వారియందు నాయకత్వమును జెల్లించుకొనుచు బోధప్రచారణములుమాత్రము గావింతురు

సీ. బాల్యమందున బహుభంగులఁ బోయెడు
మనమును నిగ్రహింపనికతమునఁ
జెడుమార్గములఁ ద్రొక్కి కడుకష్టములఁ బొక్కి
యందఱు చూడంగ నన్నికూళ్లు
కుడుచుచుండుటఁ జేసి కులగౌరవముఁ బాసి
మగిడివచ్చుట కెంతమాత్రమేని
సందు దొరకకుంట సాహసంబునఁ దన
మార్గ మొక్కఁడ ధర్మమార్గ మనుచుఁ
బ్రజల బోధింపఁ బ్రవక్తయై పలువురు
నాయకుండనఁ బైకి నగుచు లోన
గీ. వగచుచుండెడువానికిఁ బరులకుఁ దన
దోషములు సంక్రమించు నఘదుఃఖ మేల?
పంద లజ్జావిహీనుఁ డల్పంబుకొఱకు
మందిఁ జెఱచుఁ దాఁ జెడు నప్రమాణబుద్ధి.

దాసు—మహారాజా ! సభ్యులారా ! శాస్త్రిగారి యొక్కయు శర్మగారి యొక్కయు సంభాషణ మసహ్యముగాను, బక్షపాతముగాను నున్నది. సభలో మాటలాడునపుడు పలువుర చిత్తమున కుద్వేగకరముగా నుండకుండునట్లు మాటలాడఁదగునుగదా !

సుదర్శ—మహారాజా ! ఆర్యులారా ! డామాడోలీవిషయ మటుండనిండు. శర్మగారివలెనే దాసుగారును నొక్కపక్ష మవలంబించినారు. ఎవరిపక్షమును వారు ప్రతిపాదించుచున్నారు. వ్యతిరేకవ్యక్తులకు వ్యతిరేకాభిప్రాయము లుండును. సకలాభిప్రాయములును వినఁగల సమరసభావము గలిగియుండుట సహృదయులలక్షణము. దాసుగారి యభిప్రాయము లెంత నిశ్చయముగాఁ బ్రతిపాదితములైనవో శర్మగారి యాశయములు నంత నిశ్శంకముగాఁ బ్రభుసన్నిధానమునఁ బ్రకటింపఁబడుచున్నవి. శర్మగారి ప్రసంగము నిష్కపటముగ, నిశ్శంకముగ జరగవచ్చును. డామాడోలి శాస్త్రిగారూ! మీప్రసంగ మింతట గట్టిపెట్టుఁడు.

డామా—ఆ మడిమాన్యములు వారికే కట్టిపెట్టుఁడు. నే విరమించెదను.

శర్మ—మహాప్రభూ! సహృదయులారా! కలికాలవశంబున నార్యవిజ్ఞానవాహ నామధారులలోఁ బ్రవేశించిన సహస్రదోషములు నే నెఱుంగనివాఁడను గాను. విజ్ఞాన బీజ సంరక్షణమున కవకాశము కలిగింతు రనునాశతో నిన్ని దినములకు నీ మహారాజ సభలోఁ నాయభిప్రాయమును వెలిఁబుచ్చితినేకాని మఱి యే యితరసభలోను నే నిత్ఃపూర్వ మెన్నండును నోరు తెఱచి యెఱుంగను.

అభయంబొసంగెడు విభుండును, విజ్ఞులయినవారల పోషణమునం దగిన విత్తంబును సారాసారంబు లరయఁజాలు తత్త్వవేత్తలును గలుగు నిట్టిసభలో సత్యనిర్ణయమునకై సాధువులు ప్రసంగించు టుచిత మెట్లు కాకపోవును? ప్రాయము రానట్టివారు (మహారాజా, జ్ఞానముచేత ప్రాయము రానట్టివారు) తమ యభిప్రాయములను బట్టుదలతోఁ దలతోఁకయెఱుంగక వ్యాసునంతవాని విషయమైన వ్యాఖ్యానముసేయుచు విశ్వాస విగ్రహముల నెల్లెడ భగ్నము సేయుచుండువారి సభలు నిందలకుఁ గాని నిర్ణయమునకుఁ గాదు.

గీ. బాలనాయకంబు బహునాయకంబు వి
నాయకంబు దుష్టనాయకంబు
సాధు దూషణం బసద్భూషణంబు నౌ
సభ యదేరి కింపు శాంతి నింపు.

ఏకదేశంబుగా నే నప్రామాణికులగు నాయకమ్మన్యుల నంటినేగాని దాసుగారొక్కమ్మడి యార్యవిజ్ఞాన మంతపై బ్రహ్మాస్త్రప్రయోగముచేసియుండిరి. వేదశాస్త్ర పురాణేతిహాసములును, భోజకృష్ణ దేవరాయాది మహానుభావుల సచ్చరిత్రలునొక్కమారంతరించినను దాసుగారి కావంతయైనఁ జింతయుండదు కదా! ప్రకృతము నామనవి యేమనఁగా విజ్ఞానము కలికాలవశంబున శీఘ్రముగా దోసిటఁబట్టిన నీటివలె సన్నగిల్లుచున్నది. మహనీయు లద్దానిని రక్షించుట విధి. సత్సంప్రదాయ మెఱుంగని యిట్టివారల మాటలతోఁ దత్త్వరహస్య మెఱుఁగఁబడదు.

డామా—చిత్తము. మాచిరంజీవికి విద్యావిధానమును నిర్ణయింపుఁడు. ఆ మంచి మాట చెవిని వేసికొని పోయెదను.

శర్మ—
గీ. వట్టిమాటల వినినంత గుట్టుగనునె
శాస్త్రజాలంబు జాలంబు సద్గురూక్తి

# ద్వితీయాంకము

కీలకంబున మంజూషలీలఁ దెఱచి
లోమహాభాష్యసారంబు స్వామికృపను
భక్తి సేవించి శక్తినిఁ బడయకున్న.

మాటలు పెక్కేల! ప్రపంచవృక్షమునకు భరతఖండము ఫలప్రాయము. అందును సద్గురుకటాక్షగమ్యమయిన విజ్ఞానమే యమృతప్రదమగుఫలసారము. తదంగములగు మూలము, శాఖలు, పత్రపుష్ప పల్లవంబులును దత్తదుచిత గౌరవమునకుఁ బాత్రములే యయ్యు బీజమునువహించి వృక్షపరంపరకు సాధారభూతమయిన ఫలమే యపేక్షణీయమగుఁగదా! పాశ్చాత్యదేశీయవిజ్ఞానమంతయు సహృదయులకు నాదరణీయమే.

"అన్వయవ్యతిరేకాభ్యాం పూర్ణబోధ స్సమాచరేత్" పాశ్చాత్యశాస్త్రపరిశోధనలు వ్యతిరేకమునకగు, నార్యవిజ్ఞానము నన్వయమునకగు, పరిణామశీలమగునది పాశ్చాత్యజ్ఞానము. పరిపూర్ణమైనది భారతవిజ్ఞానము. పరిపూర్ణమునకు నాద్యంతములు కాని, క్రొత్తపాతలుగాని లేవు. సత్యము త్రికాలాబాధ్యము. రెండురెండ్లు నాలుగనుటవంటిది. వారినిర్ణయములు మారుచుండును. కాని మనసిద్ధాంతములు స్థిరమైనవి.

హేతుజ్ఞానమునకు హేత్వాభాసజ్ఞాన మవసరమైనట్లు, స్వమతస్థాపమునకుఁ బరమతజ్ఞాన మవసరమైనట్టు లార్యవిజ్ఞానమును స్థిరముగా నెలకొల్పుటకుఁ బాశ్చాత్యప్రకృతిశాస్త్రజ్ఞాన ముత్తమాధికారులకు ప్రవర్తకులకుమాత్ర మావశ్యకము. తదితరులకుఁ బ్రామాణ్యబుద్ధి కలిగించి భారతవర్ష విజ్ఞానము గురుకులములద్వారా బోధింపవలెను.

వర్మ—మహారాజా! గురుకులమున జిజ్ఞాసువులగు స్వల్పసంఖ్యాకులుమాత్రము పరిపూర్ణులగుదురు. ఆర్యవిజ్ఞానముపై నభిమానము మాకును లేకపోలేదు. గురుకులములు గురుకులములన్నట్లు పొసఁగఁగలదు. శర్మగారివలె ననుభవవిరుద్ధములగు నాకాశపురాణములు సిద్ధాంతములును మేమామోదింపఁజాలము.

పంతులు—మహారాజా! శర్మగారి యాశయములందు నాకు మిక్కిలి గౌరవము గలదు. పాశ్చాత్యవాతవ్యాధి తగిలి మెడ మెలితిరిగి కేవలము పశ్చిమముఖుండనై చిరకాల మట్లే యుంటిని. యదృచ్ఛావశంబున నేటికి పండ్రెండేండ్లకుఁ బూర్వము పరమహంసస్వామి నాయెడ ననుగ్రహించి యొసఁగిన విజ్ఞానచపేటికాప్రహారంబున వెనుక కీడ్చుకొనిపోవుచున్న ముఖము సుముఖమై ప్రాఙ్ముఖ మయ్యెను. ఆనాటినుండియు నార్యవిజ్ఞానముపై నాకభిమాన ముదయించినదికాని, బహువాసనాదూషితమైన మనంబుకలవాఁడనగుట భక్తిప్రపత్తులతో సాధుసేవ చేయఁజాలక శర్మగారు ఖండించిన గ్రంథభాండాగారపరిశోధనలఁ బరితృప్తినొందుచుంటిని. నమ్మకముతో

నా పుత్రులతోవలె నా మనఃపరిణామ మిమ్మహారాజు నా కనుగ్రహించిన యవకాశముచే నీసభవారికి విన్నవించితిని. అనుభవములో నాచరింపఁదగిన కృత్యము శర్మగా రేమి సూచింతురో వినఁ గుతూహలపడుచున్నాము.

రాజ—(జనాంతికము) అమాత్యశేఖరా! మన మానాఁడు పరమహంసస్వామి వారి దర్శనమున కరుగుచుండఁగా మన కీసంతు లెదురుగ వచ్చుచుండెను జుమా! మహనీయుల సకృద్దర్శనమేని యూరడిపోవదుగదా!

సుదర్శ—సత్యము. మహారాజా! పరమహంస భగవత్పాదుల బోధంబును జపేటికాప్రహారంబుగ నీమహాసభలో వర్ణించుటచేఁ దన భక్తిప్రపత్తులను, మనఃపరిణామమును దెలుపుకొనుచున్నాఁడు.

రాజశే—శర్మగారూ! తమ ప్రసంగమును వినుటకు సభికారంభదర్శుఁ గుతూహలపడుచున్నారు.

శర్మ—మహారాజా! సభ్యులారా! కాలానుసారమగు మార్పులను నే నంగీకరింపననియు, ననుభవరహితమైన ప్రసఁగములఁ జేయుదుననియు మా ప్రతివాదులు సూచించుచున్నారు. నిక్కముగ సద్వాదులమగు మేము కాలస్వరూపుఁ డీశ్వరుండని యెఱుంగుదుము. ఈజగంబంతయు నీశ్వరుని స్వరూపమని యారాధింతుము. విరాట్పురుషునకు వెన్నధర్మంబని మే మెఱుఁగుదుము. లోకమున నున్న దున్నటులు మేము భరింపఁగలము. కలియుగధర్మంబులకు వెగటొందము. శిశిరఋతువున నాకురాలి మోడుమాత్రము నిలుచును. తత్త్వవేత్త యాకులురాలుటకుఁ జింతింపఁడు. ఆకులు చెట్టున కతికింపఁ బ్రయత్నమును జేయఁడు. కాని మోడువలెనున్న కారణమున మూఢునివలె దానినిఁ గొట్టి ప్రొయ్యిలోఁ బెట్టఁ బ్రయత్నమునుజేయఁడు. నిష్ప్రయోజనమని తత్త్వశూన్యులు శాఖల నఱికినను సజ్జనులు వృక్షమూలస్కంధముల వసంతమున ఫలవంతమగుటకుఁ గాపాడుచుందురు. ప్రళయకాలమున విత్తనములు దాఁచుటకై మహనీయు లీదుష్టకాలమున సైతము పరీక్షితునిఁబోలి కొన్నియెడల తత్ప్రచారమును సహించినారు. ప్రాచీనవిజ్ఞానమును సంఘమందుఁ బ్రచారముఁజేయ నుద్యమింపరు. చక్కిలములు మొదలైన భక్ష్యములఁ జేయునపు డెంత శ్రద్ధగ తునుఁగకుండఁ జేయుదురో తినువేళల నంత నిర్విచారముగఁ ద్రుంచి నములుదురుగదా! అట్లే పరమేశ్వరుఁడు కృతాదియుగములయం దెంతపూర్ణముగ ధర్మములు వృద్ధిపొందించెనో యంత నిర్విచారంబుగఁ బ్రళయపూర్వవర్తియగు కలికాలంబున ధర్మవిఘటన మొనర్చుచున్నాఁడు. విజ్ఞానబీజ సంరక్షణకై వెదకుకొనువారికిఁ బెన్నిధులవలె మహానుభావులను వారిని సేవించి జ్ఞానమును సంపాదించు శిష్యులనుగూడఁ బరాత్పరుఁడే సంధించుచు

న్నాఁడు. కాఁబట్టి యాస్తికులకుఁ బరమార్థముకొఱకు గురుకులములను, బ్రమాణబుద్ధి కుశాగరనివారలకు లౌకికవిద్యలకొఱకుఁ గళాశాలలను గల్పించుట న్యాయమని నాయాశయము.

నాటకములోని వ్యతిరేకములగు పాత్రలన్నియు నాయకుని, రసమును బోషించునవియే. విశ్వామిత్రుఁడు, నక్షత్రకుఁడు, కాలకౌశికుఁడు, కలహకంఠి మొదలగుపాత్రలన్నియు వ్యతిరేకములయ్యు హరిశ్చంద్రునికి వన్నెదెచ్చునవియే యగును. విపణివీథియందు పథ్యాపథ్యవస్తుజాల మెంత యున్నను హితమగు వస్తువులఁగదా బుద్ధిమంతులు కొనుదురు. ప్రకృతము నిరంజనకుమారునకుమాత్రము విద్యాభ్యాసము గురుకులమునందే యొప్పునని నా యభిప్రాయము. మీఁద దేవరచిత్తము. ఇంక నొక్క విశేషము.

(౧) తన మనమున సందేహముతీరుట, (౨) తనప్రతివాదిని సభలో ముఖపిధానము సేయఁజాలు సర్వంకషప్రజ్ఞ యలవడుట, (౩) తన్నాశ్రయించు శిష్యుని సర్వసంశయములఁ బాపి తనంతవాని నొనర్చుటయు గురుకులములోని విద్యలక్షణము.

ఇఁకఁ బ్రకృతకళాశాలలయందన్నో విద్యార్థులకు జిజ్ఞాసలేదు. విత్తార్జనమే విద్యకుఁ బ్రయోజనము. సంశయములు నుండవు. ఒకవేళ నున్నను నీచదువువలన సంశయములు తీరనుదీరవు. పరీక్షావిధానమున సుమారు నలుబది గుణములు నూటికిఁ జాలునందురు. గురుకులంబున వాక్యార్థపద్ధతిలో సర్వతంత్రస్వతంత్రుఁడైనఁగాని పండితగోష్ఠిలో వచ్చు ప్రశ్నలన్నిటికి సమాధానముఁ జెప్పి యుత్తీర్ణుఁడుకాఁజాలఁడు. తల్లిదగ్గఱి నుండి తల్లితోఁబాటు గృహకృత్యముల నారితేరిన పిల్ల వడువున "అభ్యాసయోగాత్ సాన్నిధ్యబలాచ్చ"యని యన్నట్లు బోధస్వరూపుఁడగు గురుసన్నిధానమున సకలము శిష్యుఁడు సుకరముగ నెఱుఁగనగు. శాస్త్రార్థములు సులభగమ్యము లగుచుండును. నియమాదులు, భయభక్తులు, చిత్తసంయమనము సహజామస్క్సిద్ధిగల సాధువులచెంత నలవడినట్లు పొట్టకూటికై చదువులు నేర్పిన యయ్యవారలయొద్ద శిష్యులకుఁ జిత్తపరిణామము కలుగఁజేయు సన్మార్గములు పట్టువడవు.

దాసు—మహారాజా! సర్వతంత్రస్వతంత్రులగు శర్మగారింత సమరసభావమును, సామర్థ్యమును గలవారని నే నెఱుంగఁజాలనైతిని. ఛాందసముగాఁ బట్టుపట్టెదరేకాని సకలసమ్మతముగ, యుక్తియుక్తముగఁ బ్రసంగింతురని యూహింపనైతి. ఈ గోష్ఠిలో మావంటివారుగూడ నిలిచి విచారింపఁదగిన సారాంశములను శర్మగారెన్నియో నిరూపించినారు.

సుదర్మ—బహుజనసమ్మతిపై నిర్ణయముఁజేయుటకంటె సభ్యులెల్ల నేకాభిప్రాయులౌట విశేషముగద. ఇట్టిసూచనలు కానవచ్చుట శుభము.

శర్మ—బహుభాషలేల! జాబాలితీర్థముననున్న పరమహంసస్వామి యనుగ్రహమును బొందిన మహనీయుఁడు సుశీలముని నారాయణవనాగ్రహారమున నివసించుచున్నాఁడు పరమహంసయోగీంద్రు లంతర్ముఖులై యుంటచే వారి సన్నిధి బాలకులకు సిద్ధించుట కష్టము. సుశీల మునీశ్వరుం డాశ్రితులకు జ్ఞానమొసంగు ప్రవృత్తిలో నున్నాఁడు. నే నమ్మహనీయుని యనుగ్రహవిశేషంబుననే తమసభలో నానేర్చిన మాటలు పలుకఁగలిగితిని. రాజకుమారు నక్కడ కనుపుటయే శ్రేయస్కర మని నామతము.

నారా—మహారాజా! శర్మగారు సెలవిచ్చినవిషయ మవశ్య మాచరింపఁదగినది. నిరంజనకుమారుఁ డచ్చట విద్యాపారంగతుఁడు కాఁగలఁడు. నాపుత్రుఁడన్నంభట్టు బాల్యమునుండి రాజకుమారునితోఁ గలిసి యాటపాటల వర్తించుచున్నవాఁడు. వీరి నిద్దఱ జతచేసి సుశీలముని సన్నిధికి నంపుట మేలని విన్నవించుకొనుచున్నాను.

రాజశే—మంచిది. సభ్యులారా! మీ రేమని నిర్ణయించినారు?

దాము—శర్మగారి యభిప్రాయమును నేనే సంతోషముగా నంగీకరించినపుడు పంతులుగారును, వర్మగారునుగూడఁ బూర్ణముగ నద్దానితో నేకీభవింతురనియే నా నమ్మకము.

రాజశే—శ్రీ శివదాసుగారి ప్రసంగము నాకు మిగుల సంతోషము కలిగించినది. సర్వార్థసాధకము కదా సాధుసంగతి. మంత్రివర్యా, చిరంజీవిని శ్రీ వేదమూర్తులైన సుశీలస్వామివారి సన్నిధికిఁ బంపు నేర్పాటులు గావింపుము. ఈ పండితోత్తములకుఁ దగుసన్మానముఁ జేయింపుము. ఈ సంస్థానమున వారికి స్వాగతము సర్వదా సిద్ధమనుము.

సుదర్శ—చిత్తము. (తెరవ్రాలును.)

---

## ద్వితీయ రంగము

(ప్రవేశము: నారాయణభట్టు)

నారా— మహారాజుగారు కుమారుని సుశీలమునీశ్వరు సన్నిధానమునకుఁ దోడ్కొనిపొమ్మని నా కాజ్ఞాపించినారు. నేనిదే కుమారవిద్యాగారమున కరిగెదను. అదిగో చిరంజీవి యుపాధ్యాయుఁడగు వరకేసరిశాస్త్రి యిట్లే వచ్చుచున్నాఁడు.

(ప్రక్కనుండి ప్రవేశము నరకేసరిశాస్త్రిగారు)

ఏమయ్యా నరకేసరిశాస్త్రిగారూ! క్షేమమా, కుమారమహారాజుగారి విద్యాభ్యాసము సాగుచున్నదా?

నరకేసరి—ఓహో! నారాయణభట్టుగారూ! నమస్కారము. మీబోంటి పెద్దలు నన్ను నరకేసరి యని పిలుచుటయే నాకు శ్రేయస్సు. మీదయవల్ల నాయోగక్షేమముల కేమియుఁ గొదువలేదు గాని నిరంజనకుమారుని విద్యాభ్యాసవిషయ మేమి చెప్పుటకును దోఁచుటలేదు.

నారా—ఏమి? ఏమి?

నర—కుశాగ్రబుద్ధి యగుటచే నేఁ జెప్పినపాఠముల నాతఁడు వెంటనే గ్రహించును. కాని యేవిధమైన సమాధానము చెప్పనలవికాని ప్రశ్నల నడుగుచుండును. పాఠసమయమునందుఁ బరధ్యానముగ నుండును. ప్రారంభమునుండియు నిట్టి విపరీతగుణము లున్నవియే గాని, యొక్కపక్షమునుండి బొత్తిగ రాజకుమారుఁడు మన లోకములో లేఁడు. అంతఃపురదాసీజనులు నాతనిఁగూర్చి యిట్లే చెప్పుకొనుచున్నారు. పెక్కేల, నేఁడు పాఠశాలకును రాలేదు. ఎక్కడ నున్నాఁడో తెలియదు. ఉన్నటులుండి యేతోఁటలో నెచ్చటనో, కాసారతీరమందో, లేక వృక్షచ్ఛాయయందో కూర్చుండి వనమృగమయూరాదులతో వినోదించుచుండును. ఒకవైపునకు బాలకులనంపి మఱియొకవైపున నేను వెదకుచువచ్చుచున్నాను.

నారా—నేఁ డాతనిని బయనముజేసి సుశీల సన్నిధానమునకుఁ దీసికొనిపోవలయును. నేనును వచ్చెదను. మన మిద్దఱ మాతని వెదకుదము.

నర—మంచిమాట చెప్పినారు. నానెత్తినఁ బాలుపోసితిరి. అమ్మహనీయుఁ డాతని నెట్లు సవరించునో కాని, యీ రాజకుమారుని నేను మాత్రము దిద్దఁజాలను. నా కాతఁడు ముక్కునకు మించిన ముత్యము. ఆరాజర్షి కిశోరమునకు గురుత్వము వహింప సుశీలముని తగియుండునుగాని నేఁగాను.

ఆతని కెందు నాస్థగాని, యాసగాని యున్నట్లు దోఁచుటలేదు. అలబ్ధవిశ్రమాస్పదుండై శూన్యవిలోకనములతో నుండును. మూఢుం డనరాక ముక్తుం డనరాకయుండు నీచిన్నికుమారునిఁ జూచిన నావంటివాని హృదయమే దహించుకొని పోవుచున్నది.

నారా—ఈతఁడు రామాదులంబోలిన మహనీయుండగు. ఎదుటనున్న కదంబవనమం దేకాంతలతాగృహమం దెందేని యున్నాఁడేమో చూతము రమ్ము.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

(కదంబవనము: శ్రీచరణపుష్కరము. ప్రవేశము : నిరంజనకుమారుఁడు)

నిరంజ—మహాదేవ, మహాదేవ, మహాదేవ దయానిధే, భవానేవ, భవానేవ, భవానేవ గతి ర్మమ. (అని పాడుచుఁ బ్రవేశించును.)

(పంచచామరము—పాటగాఁ బాడవచ్చును)

నిరామయుఁ దయాసముద్రుని భుజంగభూషణుఁ
బరాత్పరుఁ బ్రపన్నునిఁ శుభప్రదుఁ బ్రశాంతునిఁ
నిరంజనుఁ మునీశ్వరేశు నీరజాక్షు ధీరునిఁ
హరుఁ జిదేకమూర్తి సాంబునాత్మభక్తిఁ గొల్చెదన్.

శంభో! మహాదేవ! విచిత్రంబుగ మనోహరంబుగ నీలోకము సృజియించియు నద్దానిని దుఃఖదంబుగ నొనరించినాఁడవు. భూతప్రేతపిశాచగణములతో శ్మశానమందు నివసించియు శంకరుండ వైతివి. కపాలమాలికలు ధరియించు నీయర్ధాంగి సర్వమంగళ యయ్యె. నీతత్త్వ మెఱుంగ నిలింపులేని చాలరన నే నెంతవాఁడను?

గీ. ఆఁడురూపంబుఁ జూచి కాపాడుతల్లి
వందునో! లింగమూర్తి కన్నారఁ గాంచి
యద్వయుండగుఁ బూర్ణుండ వని వలతునో!
తాపసాకృతిఁ దాల్చిన తరుణమందు
గురునిగా నెంచి భక్తిని గొలువఁగలనో.

(అని చింతించుచుఁ దెరమరుగునకుఁ బోవును)

(ప్రవేశము : డామాడోలీ శాస్త్రి)

(తెరలో 'నిరంజనకుమారా! నిరంజనకుమారా!' అని వినఁబడును.)

డామా—ఎవఁ డాపిలుచువాఁడు? అబ్బబ్బా! ఈకుఱ్ఱవిధవలు హద్దులో నాఁగరుగద. ఆపేరితోఁ బిలువవద్దురా యని యొక్కొక్కరితోఁ జెప్పలేక చచ్చిపోవుచున్నాను. మునుపే ముక్కిడి, దానిపైఁ బడిసె మన్నట్లున్నది. పెదపిచ్చి చినపిచ్చి యన్నట్లు మా మహారాజుకడుపున నొక పిచ్చిమహారాజు పుట్టినాఁడు. ఎవరికైన లోకమున మూరుపేరఁ బిలిచినఁ గోపము. నిక్షేపమువంటి పేరు నిరంజనుఁ డని యుండఁగా 'జీవుఁడా' యని పిలిచినఁగాని యాతఁడు పలుకఁడు. దేవుఁడా యని మేమందఱ మాలాగుననే పిలుచుచున్నాము. ఈచీమిడికుంక లెట్లు లక్ష్యోరించిన నాదేమి

పోయినదని యూరకుందునందునా! యాపేరు వినఁగానే మాతిక్క శంకరునికి మఱింత తిక్క ముదిరి యింటను దూరమునకేగి యేచెట్టో గట్టో యెక్కి దిగకున్న వెదకలేక నా ప్రాణములు పోవును.

పాట:— (నాదనామక్రియ - అట)

దేవుఁడా యెందున్నవాఁడుర జీవుఁడు. ?

జీవుఁడు మాజీవుఁడు మాభూవిభుని కుమారుఁడు.

జీవుఁ డెవ్వఁడు, దేవుఁ డెవ్వఁడు
జీవదేవుల తావు లెక్కడ?
భావమున గురుసూక్తి నాటిన
దేవుఁడౌనట జీవుఁ డౌర!

(ప్రవేశము: అన్నంభట్టు)

(ఎదుట చూచి) అదిగో గుభేలుగాఁడు ఎవఁడో వచ్చుచున్నాఁడు. ఓకీ పప్పుభట్టు, నీ వెవట్టా? అపారాయణయ్య కాదుకవా.?.

అన్నంభట్టు—నాపేరన్నంభట్టని యెన్నిసార్లు చెప్పినను నన్నుఁ బప్పుభట్టని పిలిచెద వేల? నారాయణభట్టుగారు మానాయనగారని నీకుఁ దెలియదాయేమి? పారాయణయ్య యనెదవేల్ల? ఇందులకే దామోదరశాస్త్రి యనుటకుమారు నిన్ను డామాడోలీశాస్త్రియని యందఱు పిలిచెదరు.

డామా—ఊరకుపేరువలె నేమి యెగిరిపడెదవురా! కుఱ్ఱవాఁడవు నీ కేమి యెఱుక, కందిపప్పునందు వెలనాటి కందిపప్పు మఱింతకమ్మఁగా నుండును. చప్పని యన్నంభట్టు మేలా? కమ్మని పప్పుభట్టు మేలా? మాతండ్రిగారిని నారాయణయ్య యనఁబోయి పారాయణయ్యయంటిఁగాఁబోలు. పొరపాటున నినను బురాణము చెప్పు వానికి శాస్త్రమేమి? "శాస్త్రేషుహీనాః కవయో భవంతి, కవిత్వహీనాశ్చ పురాణభట్టాః" ఇఁకఁ జాలు. తాతకు దగ్గులు నేర్పినట్లు నాముందు నీతోఁక జాడింపక రాజకుమారునిజాడ తెలిసియున్నఁ జెప్పు, వెదకలేక చచ్చిపోవుచున్నాను.

అన్నంభట్టు—(దామోదరశాస్త్రిచెవిలో నేమోచెప్పి పరుగెత్తును.)

డామా—అరుగో నారాయణభట్టును, నరకేసరిశాస్త్రియు నావలెనే రాజకుమారుని వెదకివెదకి యీవైపునకే వచ్చుచున్నారు. కోటలో నందఱును నన్నుఁ

జూచిన భయము. నాకు నారాయణభట్టును జూచిన భయము. ఎందఱిలోనైన, నెట్టి సమయములోనైన రాజుగారి చెవిలో మాతిపెట్టువాఁ డతఁడు. చీటికిమాటికి మహారాజుగారు నే నిట నున్నానను మాటయే మఱచి నారాయణభట్టునకే యగ్రతాంబూల మొసఁగుచుందురు.

(ప్రవేశము నారాయణభట్టు, నరకేసరిశాస్త్రి)

నారా—దామోదరశాస్త్రిగారూ! రాజకుమారుని జాడ యేమైన తెలిసినదా?

డామా—మహారాజుగారి జాడ తమ కెఱుక, కుమారమహారాజుగారిజాడ తమ కుమారరత్నమున కెఱుక. మెడమీఁదఁదలగలవానితో మాటలాడని రాజకుమారుఁడు మీకుఱ్ఱవాని చెవులుకొఱుకుచుండును. చెంతనే కోనేటిగట్టున జాతిపలకవీఁడ నొంటరిగా రాజకుమారుఁ డున్నట్టు తెలిసినదనియుఁ, దా నాతని వెంటనే తోడ్కొని వచ్చెదననియుఁ జెప్పి మీవాఁడు వెళ్లినాఁడు. పిట్ట కొంచెము, కూఁత ఘనమన్నట్లు వాఁడు చూచుట కట్లున్నాఁడుకాని మంత్రిగారికిఁగూడ నాలోచన చెప్పలేక పోవుదునా యని తలఁచుచుండును.

నారా—నీహాస్యమున కేమిగాని నిజముగా రాజకుమారునిఁ బిలిచికొనివచ్చెదనని మావాఁ డరిగినాఁడా?

డామా—జాతిబొమ్మకుఁ జక్కిలిగింతలా యన్నట్లు మీకా నాహాస్యము! వారువచ్చువేళ యయినది. మనమందఱము మొక్కసారి కానఁబడిన నాతని కేమి తోఁచి మన కగపడకుండ నెటకేని పోవునో యెవ్వఁ డెఱుఁగు. భట్టునకుఁగూడ సుశీల సన్నిధానమునకుఁ బోవ నుత్సాహము కలదు. కావున నెట్లయిన సమ్మతింపఁజేసి రాజకుమారు నిటకుఁ దేఁగలఁడు. సందేహము లేదు. రెండునిమిషములు గూర్చుండుఁడు.

నర—ఈ డామాడోలీశాస్త్రిగారు పరిహాసముమాని యింత ప్రశాంతముగ మాటలాడుట నే నెన్నఁ డెఱుంగను. మీకుండబట్టిగాని లేకున్న నన్నొంటరిగానివిఁ జేసి ఎక్కసక్కములాడి చంపుచుండును.

డామా—నారాయణభట్టుగారే నన్ను 'దామోదరశాస్త్రి' యని యంత గౌరవముగాఁ బిలుచుచుండఁ బవనగుంబిలచర్మభస్త్రిగాండ్లందఱు నన్ను 'డామాడోలిశాస్త్రి' యన నేల? వస్తువెఱుంగని వాగాడంబరమునకు నేను బెదరువాఁడను గాను. సాధుగోష్ఠివిరహితులై, ధ్యానపూజావివర్జితులై, కుక్షింభరులై, వాగ్వైఖరి శబ్దమునకే మాత్రము కలిగిన వేదాంతపణ్య విక్రేతలసన్నిధిని నాస్తికసంస్థాన సాంవత్సరికకించిదూన శతరూపికాసన్మాన ప్రాప్తిఫలకముగ గ్రంథపఠనఁ గావించిన మీబోంట్ల పాండి

త్వములు డామాడోలీ పాండిత్యములుగాని వాదిగాదు. రాజసన్నిధానమున వేషదారులగు మీబోంట్ల కెన్నటికైన స్వస్వరూపజ్ఞానము రానిమ్మని నేనే డామాడోలిశాస్త్రి యని పేరుపెట్టుకొంటిని. "అహరహో గర్వః, పరిత్యాజ్యతాం" అన్నట్లు నాకును గర్వపరిహారముగ నుండనీయని యీబిరుదము నేనేధరించినాను. ఆహా! యీశ్వరేచ్ఛాస్వరూపము. సభలో బల్లపైఁ జేయిపెట్టి యూఁగులాడుచు మాటలు తడబడఁ దలతోఁకలేక ప్రసంగించుచు, దిగుదిగుమని పలువురు కేకలువైచినను నసమర్థుఁడనని తా నెఱిఁగియున్నను, సభ్యులయెల్లరివలనఁ దన మాట లేరికి వినఁబడకున్నను, సగ్రాసనాధిపతి గంట వాయించుచున్నను దన యుపన్యాసము మానఁజాలని జానపదనాయకుని భంగి మీ క్షేమియుఁ దెలియదని తెలిసియు, నన్ను డామాడోలీశాస్త్రియని పిలిచెద వెందుకయ్యా!

నర—(స్వగతము) బుద్ధి తక్కువయై వీనిని గదలించితిని బాబూ! (ప్రకాశముగ) ఏమయ్యా! హాస్యము ముదిరి హాలాహలప్రసంగములోనికి దిగినది. విదూషకుండవు నీవు, విద్వాంసులము మేము. మమ్ముఁ దృణీకరింపవచ్చునా?

డామా—చాలు చాలు. నీవిద్వత్తు నే నెఱుంగుదునుగాని నావిదూషకత్వము నీవెఱుంగవు. ఉపకారవేతనము ననుభవించు నుద్యోగులకు, న్యాయవాదులకు, మునలమ్మలకు భాష్యశాంతిఁ జేయించుట యనుకొంటివా? ఇది మంత్రసంప్రదాయము, ఇది యోగసంప్రదాయము, ఇది సాంఖ్యసంప్రదాయము, ఇది యుపాసనాప్రక్రియ లెండు, ఇది వ్యాసఘట్టము లెండు, ఇవి తెలుసనవికావు, పంక్తి సాగనిం డనుచు దాటవేసి, గ్రంథపరిసమాప్తిచేయుట యనుకొంటివా? భద్రము. ఏమియనుకొంటివి? ఈయాసంస్థానము నీయాపీఠము ననుకొనుచున్నావేమి నీయాటసాగుటకు? ఇది రాజశేఖరాస్థానము. ముక్కుపచ్చలారని మాకుమార మహారాజు నీముక్కు నలిపివేయుచున్నాఁడు. నీవిద్వత్తు తేలినదా?

నర—(స్వగతము) నే నీతనికే సమాధానము చెప్పలేకున్నాను. ఇఁక నిరంజనకుమారునకా?

నారా—దామోదరశాస్త్రిగారూ! ఇంతతోఁ బోనిండు. ఎక్కడ తగిలి యెక్కడఁ దేలునది తెలియవుకదా మీమాటలు. భక్తిప్రపత్తులు నేర్చుకొని బాగుపడనిమ్మని ప్రభువుగారు తన్ననుగ్రహించి పిలిపించినారని యెఱుంగక తనపాండిత్య ప్రతిభను గాంక్షించి సంస్థానాలంకారముగ నాహ్వానముచేసినారని యెంచుకొనుచుండును.

డామా—మామగారు బాగుగఁ జెప్పినారు.

నర—చిన్నవాఁడనని యెంతమాటనైనను విదూషకునిచే ననిపించుట పెద్దలకు మీకుఁ దగునా ?

దామా—నేను విదూషకుఁడనైన నైతినిగాని నీవుమాత్రము పండితుఁడవు కావు, పగటివేషగాఁడవు.

నారా—నరకేసరిశాస్త్రీ, యీతఁడు సామాన్యుఁడు కాఁడు. కృష్ణరాయల సభలోఁ దెనాలి రామకృష్ణునకే చెల్లినది, రాజశేఖరాస్థానమున నీదామోదరశాస్త్రికే చెల్లినదిసుమా హాస్యము. దామోదరశాస్త్రిగారూ, పిచ్చుకపై బ్రహ్మాస్త్రమేల ? ఈతనిని వదలి ఇంతకుఁబూర్వము పాడినపాట మరల నొక్కసారి పాడుఁడు.

దామా—పాట :

దేవుఁ డెవ్వాఁడు జీవుఁ డెవ్వాఁడు దేవజీవులతావు లెక్కడ
భావమున గురుసూక్తి నాటిన దేవుఁ డౌనట జీవుఁ డౌరా.

నర—(స్వగతము) ఇన్నిచోటులు చూచితినిగాని యీసంస్థానమునన్న సేవకునితోఁ, జివరకుఁ జాకలివానితోఁగూడ మాటలాడుట కష్టముగ నున్నది.

దామా—మా జీవమహారాజుగారి స్మరణములో నీమాట మఱచితిని. నీవంటి విమతుల దూషించువాఁడ నగుటచే విదూషకుఁడ నయితిని.

(ప్రవేశము నిరంజనకుమారుఁడు, అన్నంభట్టు)

దామా—మానాయనా ! వచ్చితివా ! పెద్దమహారాజుగారు పెద్దపండితుల గోష్ఠిలో నున్నారు. నన్నటకు రానీయరు. తమ రన్నో గడియలో సుశీలమునిసన్నిధానమున కరుగుచున్నారు.

నారా—అయుష్మంతా ! మహారాజుగారి సెలవయినది, నారాయణవనమున నున్న సుశీలమునిసన్నిధానమునకుఁ దమను గొనిపోయి శుశ్రూషకు విడిచిరమ్మని.

అన్నంభట్టు—తండ్రీ, నన్నుఁగూడ రాజకుమారునితోఁ బంపెదనంటివి కాదా!

నారా—బాబూ ! నీకును రాజకుమారు ననుసరించి పోవ సెలవయినది.

నిరం—భట్టుగారూ ! నాచెలికాఁడును నావెంట వచ్చుట నా కానందముగా నున్నది. ఇంచుకయయినఁ బ్రశాంతిలేని నాచిత్త మాసుశీలముని యనుగ్రహమున శాంతిఁగాంచుఁగాక !

దామా—నీయమ్మకడుపు చల్లఁగ సకలవిద్యాధురంధరుఁడవు కమ్మ. జీవత్వమును వదలి నీవు మాకందఱకును దేవుఁడ వయ్యెదవులే,

" భావమున గురుసూక్తి నాటిన దేవుఁ డౌనట జీవుఁ డౌరా ! "

నిరం—గురుసూక్తిలబ్ధియే జీవుని దేవు నొనరించునా ? ఈతనిమాటలు, పాటలు నవ్వు పుట్టించునవైనను మిక్కిలి నాణెమైనవి సుమా !

డామా—రాజకుమారా ! ప్రథమశిక్షలో నావిధాన మవలంబించిన తరువాత నుత్తమవిద్యావిధాన మెంతయో సుకరముగ నుండఁగలదు. స్థాలీపులాకన్యాయముగ నుదాహరించెదను.

బూడిదగుమ్మడికాయ పొట్టలో నడ్డముగ గరిటెఁ గ్రుచ్చిన " ఈ " అగును. చెవుల బూరెలమూఁకుడు చెవులలో గరిటెఁ దూర్చిన "ఆ" యగును ఒకపీపా, రెండు చేటలు, నొకరోకలి, వాలుగుఱ్ఱాయ్యరోళ్లు, ఒక చీఁపురుఁగట్ట పెట్టి యేనుఁగుపాఠ మును జెప్పవలెను. ఇంక నిట్టి వనేకములు కలవు. మహారాజకుమారా, ఆశ్రితులపై నను గ్రహముంచవలెను. నా కీనాఁటిసభలో మాటాడుట కవకాశ మీయలేదు. కావున నా సిద్ధాంతము లన్నియు నొక్కగ్రంథముగ వ్రాసెదను. ఏలినవారు తిరిగి వచ్చినతరువాత వీని నమలులోఁ బెట్టింపవలయును.

నిరం—మీమాట లెప్పుడును మాకు సంతోషదాయకములే. గ్రంథము పూర్తి కానిండు, చూచెదము. నారాయణభట్టుగారూ! మీరు సిద్ధముగా నుండుఁడు. నే నిదే మా తలిదండ్రులయొద్ద సెలవు వడసి వచ్చెదను. (అందఱును నిష్క్రమింతురు.)

---

## తృతీయ రంగము

(సుశీలుని గృహము)

సుశీలు— గౌరీశంకర్ సీతారామ్, గౌరీశంకర్ సీతారామ్. (అనుచుఁ బ్రవేశించును.)

(రామచంద్రుఁడు, రామకోటి, భావనారాయణ యనుశిష్యులు ప్రవేశింతురు.)

శిష్యులు—

శ్లో. వేదవేదాంతవేదాంగసారభూతాం సముజ్జ్వలామ్,
గాయత్రీం మాతరం వందే గురువక్త్రాబ్జజాం పరామ్.

శ్లో. కరణం జ్ఞానస్య పునస్తరణం భవలంఘనాయ తాత్పర్యభరాత్
శరణం సతాంచ ముక్తాభరణం జీవ! భజరే శివం గురుచరణమ్.

(ప్రవేశము ద్వారమందు నారాయణభట్టు, నిరంజనుఁడు, అన్నంభట్టు)

నిరంజ—(స్వగతము) జ్ఞానకరణము, భవతరణము, సచ్చరణము నగు నా గురు చరణము? ఈబాలకులు నన్నుద్దేశించియే యీశ్లోకమును జదువుచున్నారా యేమి?

వటుఁడు—(నమస్కరించి) స్వామీ, నారాయణభట్టుగారు శ్రీ రాజశేఖర మహారాజుగారి కుమారునితో ద్వారమందు వేచియున్నారు. సెలవా?

సుశీలు— రమ్మనుము. నిరంజకుమారుఁ డతిమేధావి యని కర్ణాకర్ణికగా వినియుంటిమి.

(ప్రవేశించి నారాయణభట్టు, సుశీలునికి నమస్కరించి)

నారా—స్వామీ! మహారాజుగారు తమ పుత్రరత్నమగు నిరంజనకుమారుని, మీకు, శుశ్రూషయొనర్చి విద్యాగ్రహణం బొనర్పఁ బంపియున్నారు, చిత్తగింపుఁడు. జీనా! పుంభావమును దాల్చిన శ్రీవిద్యయో యన్నట్లు కూర్చుండియున్న యీసద్గురు మూర్తికి నమస్కరింపుము.

నిరంజ—(పువ్వులను సుశీలుని పాదములపైఁ జల్లుచు నమస్కరించును.)

శ్లో. దేశికాంఘ్రిద్వయం వందే సర్వశాస్త్రోపకారకమ్,
తారకం మామకం శ్రేయోదాయకం లోకనాయకమ్.

సుశీలు—(స్వగతము) స్తుతిరూపమున నీతఁడు తన కోరికను వెల్లడించుచున్నాఁడు. (ప్రకాశముగ) నీకు శుభంబయ్యెడు. (అని యాశీర్వదించును.)

అన్నం—నారాయణకుమారుఁ డన్నంభట్టు నమస్కరించుచున్నాఁడు.
(అని నమస్కరించును.)

సుశీలు—(అన్నంభట్టును నిరూపించుచు, స్వగతము.) రాజకుమారునితో వచ్చిన వీనిమా పన్యథా ప్రసరించునటు లున్నది. (ప్రకాశముగ) "తదేవ లగ్నం సుదినం తదేవ| తారాబలం చంద్రబలం తదేవ| విద్యాబలం దైవబలం తదేవ| లక్ష్మీపతే! తేఽంఘ్రియుగం స్మరామి." నారాయణభట్టూ! ఇప్పుడే పూర్వశిష్యులతోపాటు వీరును బాఠముల నారంభింపవచ్చును.

నారాయ—చిత్తము చిత్తము. సాధువులు దర్శనముచేతనే పునీతులఁ జేయుదురు. సావధానులరై సద్గురుముఖోద్గళిత బోధసుధాధారలఁ గ్రోలుఁడు. (సుశీలునివైపునకుఁ దిరిగి) స్వామీ! సెలవొసంగుఁడు! పోయివచ్చెదను. (అని నమస్కరించి నిష్క్రమించును.)

అన్నంభట్టు, నిరంజ— చిత్తము. చిత్తము. (అని గురుని కభిముఖులుగఁ గూరుచుందురు.)

సుశీలు—రామచంద్రా! ఏదిరా నిన్నటి మురారిశ్లోకము.

రామచం—స్వామీ! చదువుచున్నాను.

శ్లో. తస్యాజ్ఞయైవ పరిపాలయతః ప్రజా మే
కర్ణోపకంఠపలితంకరణీ జరేయమ్,
యద్గర్భరూపమిన మా మనుశాస్తి సర్వ
మద్యాపి త న్మయి గురుర్గురుపక్షపాతః.

సుశీలు—సారస్వతసారసర్వస్వవేత్త మురారికవిశిఖామణి కాక మఱియెవ్వఁడీశ్లోకమును వ్రాయఁగలఁడు?

[(బాలకులవంకఁ దిరిగి) భావనారాయణా! ఈశ్లోకాభిప్రాయ మేమి? ఎఱుఁగుదువా?

భావనా—చిత్తము. ఎఱుఁగుదును కాని మాలో రామకోటీశ్వరరాయఁ డీశ్లోకమున మురారికవి ఛాందసమునఁ బడినాఁడని నిన్నటినుండి వాదించుచున్నాఁడు.

సుశీలు—మురారికవి నెన్నునంతటి మూర్ఖాగ్రేసరుఁడవా నీవు! వీని కీతల విసరుకు ప్రారంభమునుండి యున్నదియే. ఏమిరా! కోటే! విధియా కర్మమాయని తోడి బాలురతో వంకరదండము పెట్టు నీకు మురారి ఛాందసుఁడు కాఁడా?

రామకోటి—(నమస్కరించి) బాలురతో నంటినిగాని తమయొద్దఁ జెప్పఁదగినదికాదు. క్షమింపుఁడు.]

సుశీలు—ఉండు. (నిరంజనునివైపునకుఁ దిరిగి) నిరంజనకుమారా!

నిరంజ—(నమస్కరించి) కుమారా యని నన్నుఁ బిలువవేఁడెదను.

సుశీలు—వత్సా! ఈశ్లోకాభిప్రాయ మేమి? చెప్పుము.

నిరంజ—చిత్తము, తెలిసినంతవఱకు విన్నవించెదను.

గీ. ప్రజలఁ బాలించుచుండ నప్పరమగురుని
యాజ్ఞ నే వార్ధకపునర లయ్యెఁ జెవిని
శిశువునుంబోలె నేఁడు శాసించు సర్వ
మూార నక్క, గురుకరుణకు మేర గలదె।

సుశీలు—బాలకులారా! మురారిశ్లోకము నొక్కసారి వినినంత మాత్రమున నర్థ మెఱుంగుటయు, దాని నింతలలితముగ నాంధ్రీకరించుటయుఁ జూడ నీతని తండ్రి యగు నారాజర్షి తపఃఫలము సుమా, ఇఁక ఏమిరా! కోటీ! మురారిపై నీకోటియేమి? ఏలరా జంకెదవు? త్రికరణశుద్ధిలేని నీబోఁటి మానవంతులు కళాశాల నలంకరింపఁ దగుదురుగాని గురుకులమున నుండఁదగరు. ప్రామాణ్యబుద్ధి కలిగిన సచ్ఛాత్రుల భక్తి విశ్వాసములుకూడ నీవలన నంతరించును. ఏమిరా! నీపూర్వపక్షము చెప్పెదవా లేదా?

రామకోటి—చిత్తము. మనవిచేయుచున్నాను. దశరథునంతటి మహారాజు వైదికవిషయములనైననుగాక సర్వవిషయములఁ బురోహితునకు లొంగిపోవుట నా బుద్ధికి సరిపడినదికాదు. శిష్యునకు స్వతంత్రజ్ఞాన మనుగ్రహింపనేరని యసమర్థుఁడు వసిష్ఠుఁడనియా? గ్రహింపనేరనివాఁడు దశరథుఁడనియా? ఇట్లు మురారి వ్రాయుట. నాకు వ్యాకరణశాస్త్రమునందును, తర్కమునందునుకూడ సందేహములు కలవు. తిజన్త మన్నట్లు సనన్తమనక సన్నన్త మనుట యేల? "పృథివ్యప్తేజోవాయ్వాకాశ కాలదిగాత్మమనాంసి నవైవ" ఇచట నాత్మతరువాత మనస్సును జెప్పుటేల? ఇట్టివి చాలకలవు.

భావనా—స్వామీ! మొన్న నీతఁడు అ. ఇ ఉ. ణ్ సూత్రములలో నొక ణకార మిత్తైయుండఁగా లణ్ సూత్రమందు మఱియొక యిత్తైన ణకారమును జెప్పనేల? అని రామచంద్రు నడుగ నాతఁడొక పద్యముతో సమాధానమును జెప్పి రామకోటేశ్వరరాయలవాయి మూయించెను.

సుశీలు—రామచంద్రా, నీకు శాస్త్రమునందే కాక కవిత్వమునందును ప్రవేశము కుదిరినదా? ఏదీ నీపద్యము?

రామచం—మీయెదుట చదువఁదగినంత గొప్పపద్యము కాదు క్షమింపుఁడు.

సుశీలు—చదువుము. చదువుము. అతివినయము వలదు.

రామచం—(సంకోచముతోఁ జదువును.)

క. ణా నిత్తుఁ జేయు వ్యాకర
ణానకు సంశయముఁ బుట్టనవ్వాఁగ నగునా
దాని నలక్షణ మని వ్యా
ఖ్యానమునకు గురుముఖమున నగు బోధమునూ.

సుశీలు—పద్యము మిక్కిలి బాగున్నది. ఇఁక దశరథవసిష్ఠుల విషయము. వసిష్ఠుఁడు సకలవిద్యాపారంగతుఁడు, సర్వజ్ఞుఁడు. దశరథుఁ డాత్మార్పణముఁ జేసి

కొన్న మహనీయులు. సన్నిధానమున నున్నంతవఱకును గురువులకు శిష్యులను బోధించుటయు, శిష్యులకు గుర్వాజ్ఞను నిర్వహించుటయు నుభయము స్వధర్మపరిపాలన మని బోధించుటకై కవి యట్లు వర్ణించినాఁడు. శివాజీ రామదాసుని, కృష్ణదేవ రాయలు తిమ్మరుసును న్రపయోజకులై సేవింపలేదు. మీఁదుమిక్కిలి యట్లాశ్రయించుటకలననే గొప్పవారైరి. రాజ్యములేని మారాయఁడు తాఁ జేయలేఁడు సరికదా, చేయుమహనీయులను, వారినిఁ బొగడు కవులనుగూడ సహింపలేఁడు.

(ప్రవేశము గోపాలశర్మ: సాష్టాంగనమస్కారముఁ జేసి వస్త్రముల సమర్పించును.)

సుశీల—ఏమిరా గోపాలా! మీయింట నందఱకు క్షేమమే కదా! మీచెల్లెలి వివాహము నిర్విఘ్నముగను, జక్కఁగను జరిగియుండునని తలఁచెదను.

గోపాల—తమదయవలన నేవిధమైన కొఱతయు లేదు. ఇంకొక్కవిశేషము. మావారితో సోమశిలలో జరుగు నుత్సవమునకుఁ బోయితిని. ఏమి చెప్పుదు స్వామీ! అచట సోమేశ్వరు సన్నిధానంబున బాలికారూపంబున నున్న శారదంబోలి తపమాచరించు నొక పండ్రెండేండ్ల బాలిక కలదు. తపోవసానంబున నామె యనర్గళమైన ధారతోఁ దత్త్వబోధమును బద్యరూపమున నొనరించుచుండును. సాధువులు, పండితులు నిత్యము వినుచుందురు. నాకొప్పినన్ని పద్యముల నొక్కచోయింటిని వ్రాసికొని వచ్చితిని. దీనిని సత్యసార మందురు. (అని చేతికి నిచ్చును.)

సుశీల—(ఆనంద పరవశుఁడై పుస్తకమును దిరుగవేయుచు) ఇబ్బాలిక కలికల్మషహారిణియగు వాగ్దేవి కానోపు. సర్వశాస్త్రములయొక్క సార మిందుఁ గలదు. బాలకులారా! శ్రద్ధాళువులై యాలకింపుఁడు. (నిరంజనునివైపునకుఁ దిరిగి) కుమారా! ఈగ్రంథమున నొక్కప్రకరణము తీసి చదువుము.

నిరంజ—చిత్తము. చిత్తము. (అని గ్రంథము తెఱచును)

సత్యసారము

గీ. సర్వసంశయములు సమసిపోయెడుదాఁక
కోరుదాని మనము చేరుదాఁక
వాసనాత్రయంబు వాడిపోయెడుదాఁక
భవము దాఁటుదాఁక వ్రతము తపము.

గీ. ఇంద్రియములచేత నెవఁడేని కన్గొను
లోకమంత, కాని లోని హరిని

భక్తుఁ డొకఁడు గాంచుఁ బ్రహ్లాదునింబోలి
కానరానివానిఁ గంబమందు.

గీ. తాప మెచ్చుకొలఁది తగ్గుచుండును నిద్ర
వలువనైన విప్పఁ దెలివిఁ దప్పఁ
గలువరించుచుండుఁ గటకటపడుచుండు
యోగి, భోగి, రోగి యొక్కరీతి.

గీ. అమృతకలశంబ యాఁకలి యయినయెడల
పుష్పశయ్యాయ సుమి నిద్రఁబోవువేళ
లచ్చి కాటపట్టు సిరుల నిచ్చునపుడు
ఆప్తగృహ మాత్మమిథునైక్య మమరుపట్ల
సర్వథా ముక్తి హరిపాదజలజవృత్తి.

సుశీలు—వత్సా! సాక్షాచ్ఛారదాపరావతారం బనఁదగు మహాయోగినీకృత సత్యసారమే నీకుఁ గరగతమయినది. పరమేశ్వరి యనుగ్రహంబున నీవు పరిపూర్ణుఁడ వయ్యెదవు.

సాంధ్యకృత్యముల నిర్వర్తింప సమయమయినది లెండు. బాలకులారా! ఈ కుమారుని జాగ్రత్తతో నరయుఁడు.

బాలకు—చిత్తము. చిత్తము.

శ్లో. ప్రణవాకారం శ్రీగురు మనవరతానందమూర్తి మార్తశరణ్యామ్,
మునిసన్నుతం సుశీలం మనసా నిత్యం భజామి మామకశరణమ్.

(అని నమస్కరించి వెడలిపోవుదురు.)

సుశీలు—గౌరీశంకర్ సీతారామ్ (అని స్మరణ చేయుచు నిష్క్రమించును)

(తెర వ్రాలును.)

# హంసవిజయము

## తృతీయాంకము

### (ప్రవేశకము)

(ప్రవేశము కలవాణి డామాడోలీశాస్త్రి తోటలో)

(డామాడోలీ తోటలో మహాముద్రలో నుండి ధ్యానము చేసికొనుచున్నట్లుండును.)

కలవాణి—మాబుద్ధిమతి వెన్నవంటి మనసుకలది. నన్నే నమ్మకొనియున్నది నిరంజనకుమారునిపైఁ బ్రాణములు పెట్టుకొనియున్నది. నా కెవ్వరికడ దిక్కు? (ముందరకుఁజూచి) ఈమహనీయుఁ డెవ్వఁడో యిక్కడ ధ్యానముచేయుచున్నాఁడు. నాచెలియదృష్టము, నాభాగ్యము నెట్లున్నదో! ఈమహానుభావుని శరణు చొచ్చి నామనోరథసిద్ధిఁ బడయుదును. (అని యాతనికి సాష్టాంగనమస్కారముఁజేసి చెంత నిలువఁబడును.)

డామా—(ధ్యానము చాలించి కన్నులుఁ తెఱచి) ఎవరు నీవు? నీపేరేమి?

కల—శ్రీమహారాణిగారి పుట్టినింటినుండి వచ్చితిని. శ్రీమతి బుద్ధిమతీదేవికిఁ బ్రాణసఖిని. నన్నుఁ గలవాణి యందురు.

డామా—మహారాజుగారు, రాణిగారు జయంతాశ్రమమునకుఁ బోయి రని యెఱుఁగవా? ఉండు, ఉండు. నీపేరేమి? కలవాణియా? కల=మనోహరమైన, వాణి=వాక్కుగలది. ఈశబ్దము స్త్రీలింగమువలె నున్నదే! నాకొంపతీయుటకు నీవెందు లకు వచ్చితివే యిచటికి! మాకూటిలో దుమ్ముపోయఁదలఁచుకొన్నావా! ఏమి? ప్రత్యేక మొకపరిషత్తు పెట్టి మానిరంజనమహారాజుగారు నిఘంటులలోని స్త్రీలింగశబ్ద ములనుగూడఁ దీసివేయించుచున్నారు. నీవేమంతయుఁ జూచినకొలఁది సందేహము లేదు, నీ వాఁడుదానివలెఁ గానఁబడుచున్నావు. ఆఁడదాని వీడ కెందులకువచ్చితివే!?

కల—(స్వగతము) బ్రాహ్మణుఁడు పెద్దవాఁడే కాని చిలిపిమాట లాడుచు న్నాఁడు. డామాడోలీశాస్త్రి యీయనయే యైయుండనోపు. నన్నేమన్న నేమి?

నాకార్యము నెఱవేఱవలెను. మఱియు విదూషకులు పురుషులక్రిందఁ బరిగణింపఁబడరు. నేను జోరవచేసి మాటలాడి యీతనికి టోపీవేసి కార్యముసాధించుకొందును. (ప్రకాశముగ) స్వామీ, ఒంటరిదానినిఁజేసి యెన్నోని మాటలాడితిరి. ఆఁడదాన నగుట, నీడ నాకుఁగల నిస్సహాయస్థితినుండి నన్నుద్ధరించుటకు మీకరగ్రహణముగాక వేఱుపట్టు లేనిదాన నగుటచేతను నన్ను మీ రేమన్నను దప్పుపట్టఁజాలను.

ఢామా—ఓరిబాబూ! ఇది యెవతెరా! ఇది మేనకయో రంభయో యైయుండనోపు! వేయికన్నులుండియు గ్రుడ్డివాఁడే యింద్రుఁడు. నేను గనులుమూసికొనుటఁ జూచి తపస్సనుకొని తనకెక్కడ నెసరుపెట్టెదనో యనుభయముచేత నా తపోభంగము చేయుటకు దీనిని పంపినాఁడాయేమి? ఎవరే పిల్లా! నీవు నిజముచెప్పు. మహారాణి పుట్టింటిదానవైన నామెకడ కేగవలసియుంటివి. ఆమెకు వేదాంతము ముదిరి పుట్టినింటివారి సందేశము తెచ్చిన పూఁబోఁడినైనఁ గన్నెత్తి చూడనప్పుడు నెత్తిని మేలిముసుఁగు వైచికొని వచ్చినదారినే పోపక నావెంటఁబడనేల?

కల—మహారాణిగారి వైరాగ్యముచే మీయందఱముందు నేనింత పలుచనైతిని. యువరాజపట్టాభిషేక మని తెలియఁగానే మాబుద్ధిమతీదేవి చిన్ననాఁట నుండియు నిరంజనకుమారుని గుణరూప వైభవాదుల భావించుచుండుటచేఁ దన మనోరథ మెటులా మహారాజకుమారునకుఁ దెలియఁజేయుదునా యను చింతతోఁ జిక్కిపోవుచున్నది. గిరిరాజకుమారివలె నేకాంతమున నాతనిఁగూర్చి తపించుచున్నది. ఆమెస్థితియంతయుఁ గాంచి యామె తల్లియుఁ జాలతడవు తలపోసి నన్నుఁ బిలిచి యిట్లనియె.

"ఉషాకన్యకుఁ జిత్రలేఖవలె మాబిడ్డకు నీవు ప్రాణసఖి వగుటఁ గల్యాణపురమునకుఁ బోయి మాయభీష్టము ధర్మాంబ కెఱింగించి, నిరంజనకుమారునకును గన్యప్రేమాతిశయంబులు వర్ణించి, కల్యాణ మహోత్సవానంతరము మహారాజదంపతులు జయంతాశ్రమమునకుఁ బయనము చేయునట్లు సంధానము చేయుము" అని నన్నుఁ బంపిరి.

ఢామా—ఈమాట నాకప్పుడే యేల చెప్పలేదు?

కల—నాకుఁ దమతో నింతమాత్రము చనవు కుదిరిన నాభాగ్య మెట్లుండెడిదో!

ఢామా—కలవాణి, నీపలుకులు కలకండపలుకులవలె నోరూరఁ జేయుచున్నవి. తరువాత తరువాత.

కల—నేను మహారాణిగారికి మ్రొక్కి నాసంగతిఁ జెప్పఁబోవుచుండఁగా మనవా రందఱును బాగున్నారా యనిమాత్ర మడిగి తన చేటినిఁబిలిచి, యిది మాయమ్మ

గారింటనుండి వచ్చినది. మా మేనగోడలికి బహిఃప్రాణము. మేము మహారాజుగారి ప్రయాణసంరంభములో నున్నాము. దీనినరసికొనుచుండుమని చెప్పి వెడలిపోయెను.

డామా—నిజమే; ఆమె యెంతకేని తగును.

కల—ఇం దేమియు నసత్యము లేదు. స్వామీ, తమవంటి పెద్దబ్రాహ్మణులతో నబద్ధముఁ జెప్పుదునా?

డామా—ఓసి అమ్మకూఁతురా! మాటిమాటికిని బెద్దబ్రాహ్మణుఁ డని పిలుచుచున్నావు. నీకంటి కంత తాతగఁ గనఁబడుచున్నానాయేమి?

కల—అక్కా అంత మీకేల? నేను మిమ్ములను బావగా రనియే పిలిచెదను. మీ యాజ్ఞ మీఱుదానను గాను. తరువాత నాయవస్థ యాలకింపుఁడు. జయంతాశ్రమమునకుఁ బయనమగు మహారాణిగారిబండివెంటఁబడి దారిలో నెట్లో వచ్చినపని యామె కెఱింగింపఁగా నామె "అంతపుణ్యమా! చిరంజీవి మిత్రులతోఁ జేరి యైచ్ఛిక బ్రహ్మచర్యము పూనియున్నట్లు విన్నాను. నీవు తిరిగి రాజధాని కేగి రాజకుమారుని వేడుక చెలికాఁడగు దామోదరశాస్త్రిగారినిఁ గలసి యోజించి చేతనైన ప్రయత్నము చేసి పొమ్ము. ఈశ్వరేచ్ఛ యెట్లున్నదో యట్లు జరగఁగలదు. నాకింక గురుశుశ్రూషాపరాయణులగు మహారాజు ననువర్తించుటయే కర్తవ్యము. పాపము! నా మేనగోడలు బుద్ధిమతి నన్ను నమ్ముకొనియున్నది కాఁబోలు! శ్రీనివాసులకృప యెట్లున్నదో? నీవు మరలిపొమ్ము" అని నన్ను వెనుకకుఁ బంపివేసెను.

డామా—ఎంత పిచ్చితల్లి మహారాణి! చేతి కెదిగిన మహారాజు కుమారుఁడు. తన్ను నమ్మిన మేనగోడలు కోడలు. ఎవతెయయిన నీసౌభాగ్య మనుభవించుట మాని మగనివెంటఁ జాంద్రాయణాదివ్రతములు సలుపఁజనునా? కలవాణీ! నీవు బుద్ధిమతీదేవి పటమునైనఁ దెచ్చితివా!

కల—(ఒకచిన్నపటమును దీసి) ఇదిగో ప్రాణతుల్యముగ దీనినిఁ గాపాడుకొని వచ్చితిని. నీవే దైవమని నమ్మి నీచేతఁ బెట్టితిని. మాచెలికిఁ బ్రాణదానమును జేసిన పుణ్యమునఁ బొందు (అని కంట తడిపెట్టుకొనును.)

డామా—(స్వగతము) ఏమి దీని సఖీవిశ్వాసము! (ప్రకాశముగ)మంచిది. నీవును శీఘ్రముగ సుదర్శన మంత్రిగృహమున కేగి సవినయముగ నమస్కరించి, నీ వచ్చిన పనియు, జరిగినస్థితియు విన్నవించి సెలవుపుచ్చుకొని నీయూరికిఁ బొమ్ము. తక్కినదానిని నేను నిర్వహింతును.

కల — మీ రామాట చెప్పిన నాకింక నొండు సందియ మేల? మీ ఋణము నే నుంచుకొనుదానను గాను.

డామా — ఈతొందరలో నయ్యెడిదేమి? పెండ్లికి మీయూరికి తరలిరామా! అప్పుడు నీనిగ్గు తేల్చనా ?

అంతపుణ్యము పట్టెనా, అడుగవలెనా? సెలవొసంగుడు. (అని చెప్పి పోవును. డామాడోలియు నిష్క్రమించును.)

---

## ప్రథమరంగము

(సభాప్రాంగణభూమి - నిరంజనుఁడు)

చ. ఒకని ప్రసక్తి యేల! శివయోగికి స్వాత్మసుఖైకభోగికిన్
సుకవిసుధాంశుమాలికిని, శోభనవృత్తికి, శాంతమూర్తికిన్
సకల గురూత్తమాంఘ్రియుగసారసభక్తికి, భవ్యశక్తికిన్
సుకృతికి, సాధుసద్గతికి, సూనృతవాదికిఁ, దత్త్వవేదికిన్ ?

ఈజీవుని చిత్తక్షోభమునకుఁ ద్రికరణశుద్ధి లేకపోవుటయే కదా కారణము. స్వధర్మదీక్ష యింకను దృఢముగ మనసున నాటలేదు. పరధర్మములపై వలపు పూర్ణముగా వదలలేదు.

కర్మభూమియైన భరతఖండమునఁ బుట్టినవారికి నీరత్నగర్భ యొసంగు పాఁడి పంటలు, నిండలి కళలు, శిల్పంబులు, శాస్త్రంబులు, సద్గురూపదేశములును బరాపేక్ష లేకయే శారీరక మానసికాత్మానందము లొసంగఁజాలు ననుట సిద్ధాంతమని సుశీలసన్నిధానమున కేగిననాఁటనుండియు నామదిని నానాఁటికి దృఢమగుచున్నది. చుట్టుప్రక్కల నవనాగరికతావిజృంభణ మప్పుడప్పుడు మనస్సును జలింపఁజేయుచున్నది. పాపము! నాచెలికాఁ డన్నంభట్టు నామాటమీఁద పరదేశములకేగి పలుపాట్లు పడుచున్నాఁడుగదా! లోకులు పలువురు జగము సత్తని నమ్ముచుండఁగా జ్ఞాని యొక్కఁ డసత్తనుచున్నాఁడు. ధనకనకవస్తువాహనాదికములు, దారాపుత్రాదులు, స్రక్చందనాది భోగంబులు మొదలగువానికొఱకుఁ బ్రజలు పలుపాట్లు పడుచుఁ బోరాడుచుండ రాజయోగియొక్కఁడే వైరాగ్యమే యభయం బనియు, మానవులకు సర్వవస్తువులును దుఃఖదాయకము లనియు నిర్ణయించుచున్నాఁడు. బహుజనాచరణీయ మగునది ధర్మ

మని చెప్పుటకు వీలులేకున్నది. ఒక్కొకతతి సంఘపరంపరగా బహుసంఖ్యాకులు స్వస్థానవేషభాషలు సమ్మతింపక పరమత, పరధర్మ, పరదేశ, పరభాషా, పరసంప్రదాయముల నవలంబించుచుండుట చూచుచున్నాము గదా! జగదీశ్వరీ! నామనంబున నెందును భయభ్రాంతులు చొరనీయక శాంతి నెన్నఁడు సమకూర్చెదవో ?

దౌవారి—జయము జయము. మహారాజా! తమ దర్శనార్థము ఖనిజశాస్త్రజ్ఞులును, శిల్పశాస్త్రజ్ఞులును వచ్చియున్నారు.

నిరంజ—వారి నందఱను దర్బారునకుఁ బ్రక్కగదిలోఁ గూరుచుండఁబెట్టుము. నీవు పోయి కార్యదర్శి శివదాసుగారినిఁ బిలిచికొనిరమ్ము.

దౌవారి—చిత్తము. (అని నిష్క్రమించును.)

నిరంజ—(స్వగతము) నాపడుకగదిలోని బల్లపైకి వచ్చినపటమునఁ జిత్రింపఁబడిన నాతీమణి యెవ్వరో ? స్త్రీపటమును నా శయనాగారమునకుఁ దెచ్చునంతటి స్వాతంత్ర్యమును, సాహసమును నేరికిఁ గలవు ? వివాహము మాన నిశ్చయించిన నాకు నీస్త్రీప్రసంగము విచారించుటకూడ లజ్జను. దీని నెవ్వరు నెఱుంగకుండ భద్రపఱచెదను. పెండ్లిమాట కేమిగాని యయ్యదిమాత్ర మతిమనోహరమైన వ్యక్తి యనుటకు సందియములేదు. "యత్రాకృతి స్తత్ర గుణా వసన్తి" అనునుడి కలదుకదా!

(శివదాసు ప్రవేశము)

దౌవారి—మహారాజా! కార్యదర్శిగారు వచ్చియున్నారు.

నిరంజ—రమ్మనుము.

శివదా—ఏలినవారిపార్శ్వవర్తి శివదాసు నమస్కరించుచున్నాఁడు.

నిరంజ—మంచిది. మీ తలిదండ్రులకు సేమమా ?

శివదా—చిత్తము. మహారాజా! కొలఁది దినములక్రిందట దేవరవారి యొద్ద సెలవుతీసికొని పోయియుంటినిగదా! నాస్తికుఁడనైన నన్నుఁ జూచి విసిగి యిలువీడి భద్రాచలమునకుఁ బోయి యచట వాసముచేయుచున్న మాజననీజనకులను క్షమాపణ వేఁడి పిలిచికొనివచ్చితిని. మాతండ్రి, పెద్దమహారాజుగారు పోషింపుచున్న సత్రయాగగోష్ఠిలో సత్కాలక్షేపము చేసికొనుచు బ్రహ్మానందభరితుఁడై యున్నాఁడు. నన్నీపాటి యాస్తికునిం జేసినందులకు తమధర్మసంస్థాపనము ననుక్షణముఁ బొగడుచుంటను.

నిరంజ—(స్వగతము) ఈతఁడు తనతలిదండ్రులకు గలుగఁజేసినంత విశ్రాంతిని మాతలిదండ్రులకు మేము కల్పింపక లేకపోయితిమికదా! (ప్రకాశముగ) ఏమి యీ దినము విశేషము ?

శివదా—ఆయాశాఖలవారికిఁ బంపఁదలసిన జాబు లన్నింటిని బంపివైచితిని. ముఖ్యముగా దేవరవారు సంతకముఁ జేయవలసినవానినిఁ దెచ్చితిని. చిత్తగింపుఁడు.

మహారాజకుమార వ్యాయామక్రీడాసంఘకార్యదర్శి యిట్లు వ్రాయుచున్నాఁడు: క్రిందటిపక్షమునఁ జెన్నపురిలో జరిగిన వ్యాయామ సమావేశమున గుఱ్ఱఁపుఁబందెము నందును, జలలక్ష్యసిద్ధియందును, మల్లవిద్యయందును, ఖడ్గవిన్యాసమునందును దేవర వారు ప్రప్రథమమున వచ్చినందులకు మహారాజకుమారు లందఱును "మహాసత్త్వ" యను బిరుదమును ప్రశంసాపూర్వకముగ దేవరవారి కొసంగినట్లు తీర్మానింపఁబడిన దని.

నిరంజ—మంచిది. వారు చేసిన సమ్మానమును మిక్కిలి కృతజ్ఞతతో నందు కొంటి మనియు, నీమాఱు జరుగు వ్యాయామప్రదర్శనమును మన సంస్థానమున కాహ్వానముఁ జేసితి మనియుఁ దెలియఁబఱుచుఁడు.

చోపుదారులు (ప్రవేశించి) జయము జయము. ధర్మవీర, ధర్మప్రతాప, మహాసత్త్వ, జీవమహారాజునకు జయము జయము. (అని వెళ్లిపోవుదురు)

నిరంజ—దాసుగారూ! ఖనిజశాస్త్రజ్ఞులును, యంత్రశాలా నిర్మాణదక్షులును వేచియున్నవారఁట. మీరు మొన్న నాతోఁ బ్రస్తావించినది వీరినిగుఱించియే కాఁబోలు.

శివదా—చిత్తము.

నిరంజ—లోహకారవిద్య మనదేశమున విరివిగ వ్యాపించియున్నది. లోహస్వరూపము, వినియోగము, మిశ్రవిధానము మొదలగునవి రసశాస్త్రములయందును, శిల్పశాస్త్రములయందును జెప్పఁబడినవి. ఖనిజశాఖ మన సంస్థానమునఁ బెట్టఁదలఁచు కొనలేదు. నేలబొగ్గుయొక్క యవసరము లేకయే యడవులలో నేసంవత్సరమున కాసంవత్సర మెండిన కట్టెపుల్లల సేకరింపఁజేసి మనదేశమున వాడుచున్నారు. ఇఁక నిరువదియైదు సంవత్సరములకంటె సీమగనులలో బొగ్గు లభింప దనుచున్నారు. అచట నడవులా లేవు. గోతులు పెట్టి లోపలి వన్నియు లోడిన భూమి ఫలించునా? సహజముగ దొరకు రత్నములును, లోహములును సంపాదించి వినియోగించుట మేలుగాని బంగారుగ్రుడ్డుపెట్టుబాతును జంపినట్లు భూస్వభావమునుమార్చు ఖనిజశాస్త్రములతో మనకుఁ బనిలేదు. వీరు మన శాస్త్రంబులఁ బరిశోధన గావించియు, భరతఖండమున నింకను శేషించియున్న శిల్పులఁ బరీక్షించియుఁ దదనుభూతప్రయోగములను, దత్కర్మసిద్ధియుఁ గాంచి సంవత్సరాంతమున నివేదికను బంపువ ట్లేర్పాటు గావింపుఁడు వారి పరిశోధనలకు వలయు ప్రాచ్యలిఖిత గ్రంథములను, బండితులను వారి కొప్పగింపుఁడు. ఈశాస్త్రవేత్తలకు నిత్యనైమిత్తికముల కగు వ్యయమును సంస్థానమునుండి యిప్పించునది. నివేదికనుబట్టి వారికి భూరిబహుమతు లొసఁగఁబడు ననియుఁ జెప్పుఁడు.

శివదాసు—చిత్తము. దేవరసంస్థానమునఁ గావింపఁబడుతీర్పులు సర్వరాజన్యులకును మార్గదర్శకములుకదా! నాయనగారియాశయము లేలినవారి ప్రభుత్వమున మూర్తీభవించినవి.

నిరంజ—మంత్రిగారు వచ్చువేళ యగుచున్నది. ఇంకఁ జెప్పఁదగిన దేమైనఁ గలదా?

శివదా—అన్నంభట్టుగారి జాబొక్కటియే. ప్రకృతిశాస్త్ర పరిశోధనలు పూర్తి యయినవనియు, సాంఘికశాస్త్రములు, సంఘనిర్మాణసమస్యలు, ధనికదరిద్రభేద నిర్మూలక సంఘసిద్ధాంతములు, స్త్రీపురుషసామ్యసమస్యలు, దిగంబరసిద్ధాంతములును బరిశోధించుచున్నా ననియు, నింక నెంతకాల మిచట నుండవలయునో నిర్ణయింపఁజాల ననియు వ్రాయుచున్నాఁడు.

నిరంజ—అన్నంభ ట్టెంత వెఱ్ఱివాఁడు! ప్రకృతిశాస్త్రము లన్న నవియేమో చూచి రమ్మంటిని గాని సాంఘికశాస్త్రములలో వారు మనకు నేర్పున దేమి? ఆర్య సంప్రదాయముల నేమని కీర్తింతుము. శూద్రుండగు సూతునిచే మహర్షులకుఁ బురాణములు చెప్పించిరి. త్రికరణశుద్ధిలేని బ్రాహ్మణోత్తములకంటె వదె కలిగిన శ్వపచుఁడు ముఖ్యుఁ డనిరి. శ్రీకృష్ణభగవానుఁడు చెంచెతను వరించి చెంచువారలకుఁ గులదైవతమై వారలకును, నితరులకు నార్యులకును స్నేహబంధము కల్పించెను. మహాదేవుండు శబరులతో సామ్యమొంది వారలకై శాబరమంత్రవిధానముల వ్యాపింపఁజేసి యార్యసంఘముతో నద్వైని నంటఁగట్టెను. రంగనాథుండు బీబీనాంచారిని బరిణయమై మహమ్మదీయసంఘసఖ్యమును సంపాదించెను. తానీషాకు భద్రగిరిరామచంద్రుఁడు ప్రత్యక్షమై హిందూమహమ్మదీయసమస్యను లేకుండఁజేసినాఁడు. సంఘములఁ గట్టుకొనుటలో మనవారల యొక్క నేర్పేర్పు లేరికిఁ గలవు? ప్రసిద్ధికెక్కిన పన్నిద్దఱాళ్వారలలో నెన్ని తెగలవా రుండలేదు? దాసుగారూ! అన్నంభట్టునకు వెఱ్ఱి తీరినప్పుడే రానిండు. స్వయముగా వ్రాయునవకాశ మిపుడు మాకు లేదు. ఆతనికి వ్యయమునకువలయు సొమ్మునుమాత్రము మన ఖజానానుండి పంపుచుండుఁడు. అతనికిక్ష్మేమోదంతమును నా కప్పుడప్పుడు తెలుపుచుండుఁడు. చాలును.

శివదా—చిత్తము. (అని నిష్క్రమించును)

దౌవారి—మహారాజా! మంత్రిగారును, డామాడోలీశాస్త్రియు ద్వారమందు వేచియున్నారు.

నిరంజ—రమ్మనుము.

(ప్రవేశము మంత్రి, డామాడోలీ)

నిరంజ—(సింహాసనమునుండి దిగి మంత్రికి నమస్కరించును. మంత్రి యాసనముపైఁ గూరుచుండఁగాఁ దాను దనసింహాసనముపైఁ గూరుచుండును.)

డామా—రాజశేఖర మహారాజర్షి పుత్రా, సకలవీరలోకస్తోత్రపాత్రా! కవిజనప్రగీతమహాసత్త్వకీర్తీ! నవయౌవనమనోహరమూర్తీ!

నిరంజ—పెద్దలసన్నిధానమునసైనను నీపొగడ్తను మానవయ్యా! నీకు నమస్కారము.

డామా—శీఘ్రమేవ వివాహమహోత్సవప్రాప్తిరస్తు.

సుదర్శన—తథాస్తు.

నిరంజ—(స్వగతము) నావివాహమువిషయమున నిద్దఱు నేకాభిప్రాయులైయున్నారు. ఆహా! నేఁడేమో చిక్కు సంభవించున ట్లున్నది. డామాడోలిమాటల కేమియని యందునా, మంత్రివర్యులును తథాస్తని యనుట నన్ను మిక్కిలి కలఁచుచున్నది. పటమునన్న ఛాయాప్రతిబింబమునకు నాధారభూత మైనబింబము నుండునా? అది యేకాలపునాఁటివ్యక్తియో దాని నమ్ముకొని నా మనోనిశ్చయమును మార్చుకొనుటయా?

సుదర్శ—ఏమయ్యా శాస్త్రీ! మహారాజకుమారుని నూతనప్రభుత్వమెట్లు ప్రజలు గ్రహించుచున్నారు?

డామా—ప్రజ లెల్లరు నాయుష్మంతుని కమనీయగుణగణములఁ బొగడుచు నీతఁడు తండ్రికీర్తికి వన్నెఁబెట్టఁదగినవాఁ డనుటకు సందేహము లేదనుచున్నారు. కాని మీపైనిఁ బెద్దనింద వచ్చియున్నది.

నిరంజ—అమాత్యశేఖరులకుఁగూడ నిందయా?

డామా—మహారాజకుమారుఁడు వృద్ధమంత్రిగారియాజ్ఞకుఁ బూర్ణముగా లోఁబడియుండు రని మంచిచెడుగులు తా విచారింపకయే యాతఁడు చెప్పిన ట్లాచరించుననియుఁ బ్రథమమున ఏకొలఁదిమందియో యనుకొనుచుండిరి. ఇప్పు డీవిషయము రెండుచెవులసందునఁ దలకాయగలవా రందఱును జెప్పుకొనుచున్నారు.

నిరంజ—పూజ్యుఁడు, పితృసమానుఁడు నగు నమ్మహనీయు ననుసరించుట వారికిని నాకును ఖ్యాతివిషయమేకాని మఱియొకండు గాదు.

డామా—అంత యభేదప్రతిపత్తి యమాత్యశేఖరునితో నేలినవారు కల్పించుకొనియుండ మంత్రిగారు చెప్పలేదు కాని చెప్పియుండినపక్షమునఁ బట్టాభిషేకమహో

త్సవతూర్యారావములు శాంతింపకపూర్వమే కల్యాణమహోత్సవమును మేము కన్నుల కఱవు దీరఁ గాంచియుండవలసినవారముగదా యని యనుకొనుచున్నారు.

సుదర్శ—రాజకుమారునివిషయమైన భారము నంతయు నాపై నిలిపి మహారాజు తపోవనమున కరిగెను. ఆతఁడు ధన్యాత్ముఁడు. ఎప్పుడు చిరంజీవి గృహస్థాశ్రమదీక్షఁ బూనునా యని నిరీక్షించుచున్న నేను జెప్పకపోవుదునా?

నిరంజ—సర్వజ్ఞు లయిన యమాత్యశేఖరులకుఁగూడఁ గేవల మైహికమును, దుచ్ఛమునగు వివాహమువిషయమున నిట్టియభిప్రాయ ముండునని యూహింపనైతిని.

సుదర్శ—కుమారా! నీ వన్నట్టులు వివాహము కేవల మైహికంబునుగాదు, తుచ్ఛంబును గాదు. వసిష్ఠమహర్షి తపోమయమైన జ్యోతి యని యరుంధతిని వర్ణించినారు.

చ. గురునుపదేశశక్తి, ననుకూలసతీమణిసేవ, భక్తిచేఁ,
గర మనురక్తిచేఁ, బ్రబలకామముచే, మహనీయసూక్తిచే,
సరసపుదృష్టిచే, విమలసాత్త్వికభావముచే, సదా మనో
హరముగఁ గొల్వ, జీవుఁడు పరాత్మను జెందెడు రామసత్కృపన్.

శంకరుంకు భార్య కర్ధశరీర మొసంగె. చతుర్ముఖుం డర్ధాంగికై ముఖం బొసంగెను. పంకజనాభుండు ప్రియురాలికి హృదయ మొసఁగెను. అనుకూలదాంపత్య మఖిలార్థప్రదం బగు.

క. భ్రమరముఁ గమలము నొక్కట
సమకూర్చినదేవుఁ డిచ్చు సకలశుభంబుల్
అమరత్వ మైన నొల్లమి
సమరసమిథునము తనయెడ సర్వం బుంటన్.

నిరంజ—

క. మునుపటికత లేలాకొ మా
నినులఁ భువి నమ్మరాదు నీ చెప్పినచొ
ప్పునఁ గానరారు ముదితలు
మనమునకును శాంతి నీరు మంత్రివరేణ్యా!

ఉ. లేదుకదా కృపాలవము లేమలయందునఁ గాముకాళికిన్
లేదుగదా సుఖంబు లవలేశము వారలయందు ధైర్యమూ
గాదుగదా యథావిధిగఁ బ్రాంజలులై భజియించి మ్రొక్కినన్
బోదుగదా మనోమలినముల్ దరిఁ జేరఁగ నెట్లు పూరుషుల్.

డామా—ఉన్న సంగతి మహారాజుగారు చెప్పినారు. నాయనుభవమును నట్టిదె.

క. కట్టింతురు కొట్టింతురు
పుట్టింతురు లేనిమాట పూవుంబోఁడుల్
పెట్టింతురు విష మైనన్
గట్టా! యిటువంటిచిత్రకర్మము తగునే?

క. సారసదళనేత్రలకై
సారెకుఁ గష్టింప నేల సన్న్యాసమునన్
భారం బంతయుఁ దీరున్
గోరిననియమంబున కనుకూలత కుదురున్.

సుమంత్రి—శాస్త్రీ! వివాహప్రాప్తిర స్తని దీవించితివికదా యని నీమాట నూతఁజేసికొనియుండఁగా నేమి యిట్లెగురుతిరిగితివి? ఎప్పుడును బరిహాసము చెల్లునా? దేశకాలపాత్రముల నెఱుఁగవలదా?

క. కనకాంగి చెంత నుండినఁ
దనుకాంతియు ధనము బలము ధైర్యము హెచ్చున్
ఘనబోధమహిమఁ దత్త్వం
బును గని మోదింతు రుత్తముల్ విప్రవరా!

డామా—చిత్తము చిత్తము. మంత్రిగారి మాటలకు మాఱుగలదా? పురుషుల కంటెను స్త్రీలే తెలివికలవారు. సందేహము లేదు.

క. చదివినఁ బండితు లగుదురు
విదితము గాకున్నయెడల వెఱ్ఱులె పురుషుల్

చదివినఁ జదువకయున్నఁ
ముదితలు విద్వాంసురాండ్రు పుట్టుక మంత్రీ!

మూడుజాములను మక్కులు మూసికొని తపస్సుచేయు మునీశ్వరులు కృష్ణుఁ డన్నమమగ నోసఁగుటకు శంకించుచుండ వారిభార్యలు యజ్ఞేశ్వరుఁ డగు కృష్ణున కన్నమిడి తృప్తిఁ గావించిరి. తరువాత నాఋషీశ్వరులు కటకటా మోసమాయెఁ గాంతలపాటియు బుద్ధిలేదాయె నని మొత్తుకొనిరి.

నిరంజ—ఏమయ్యా శాస్త్రి! ఏయెండ కాగొడుగును బట్టుచున్నావు!

డామా—బుద్ధిమతు లెల్ల కాలంబులను గలరు. (మంత్రివైపునకుఁ దిరిగి) అమాత్య శేఖరా! మన మహారాజునకు నట్టి బుద్ధిమతి యొక్కతె లభించె నేని మఱి తో నిటులు వాదించునా?

నిరంజ—(స్వగతము) పడుకటింటఁగల పటమునందలి వ్యక్తి బుద్ధిమతిది కాదు కదా! దానినిగూర్చి శ్లేషగా మాటలాడుచున్నాఁడా యేమి యితఁడు? ఘుణాక్షర న్యాయముగ నామసామ్యము కుదిరెను. విదూషకుని మాటలకు విలువయేమి? (ప్రకాశముగ) మగవాఁడు పిచ్చివాఁడై మగువల నమ్మినమ్మి చెడుచుండును. స్త్రీహృదయము మాయాక్రాంత మని యెఱిఁగియెఱిఁగియు నద్దాన భ్రాంతిఁ దగులుట దగునా?

ఆ. కామి యైనవాఁడు కల్లసంసారంబు
లో మునుంగు నాత్మలోఁ గలంగుఁ
గామి గానివాఁడు రాముఁడై నిశ్చింత
సహజకర్మమందు శాంతిఁ జెందు.

సువర్ణ—కుమారా! నీపట్టువల వడలవు కదా! వేల్పులును బెద్దలును నీపాటి విచారింపకయె యర్థాంగుల నంగీకరించిరా?

గీ. స్త్రీలు పూజ్యులు పండితచిత్తవృత్తు
లరసి మెలఁగుచు నేర్పోర్పు లతిశయిల్ల
నిహపరసుఖంబు లెప్పట్ల నిచ్చుచుంటఁ
బ్రీతిమతి చిత్రరీతి స్త్రీజాతినీతి.

నిరంజ—క్షమింపుఁడు, చిత్రరీతికాదు, చిత్రాంగిరీతి.

క. ఎన్నని చెప్పమయ్యా
పున్నెంబున కంతరాయము వివాహంబౌఁ
గన్నులఁ గనమే యీఁగలు
తన్నుకొనక శ్లేష్మమందుఁ దగులుకొనంగన్.

సుదర్శ—మాటకు మాట చెప్పుట యొకవిశేషమా? శక్తిహీనుం డెందును నసమర్థుండ యగు. శక్త్యంశసంభూత స్త్రీయును, శివాంశసంభూతుండు పురుషుండు నగుట శాస్త్రసిద్ధ ముభయులకును జీవత్వదోష ముడిగిన శివశక్తు లగుదురు.

క. నిర్వాణపదము నిచ్చుక
గర్వము లేనట్టిరమణి కపటము వీడుక
సర్వముఁ దెలియంబల్కును
శర్వుంగాఁ జేయుఁ దాను శక్తియ యగుటన్.

నిరంజ—అమాత్యశేఖరా! మీరు విచారించి నిర్ణయింపవలసినకార్యము లెన్నియో కలవని శివదాసిప్పుడే వచ్చి మనవిచేసికొనినాఁడు.

సుదర్శ—(స్వగతము) నన్ను మఱపింపఁ జూచుచున్నాఁడుగా! నేనుమాత్ర మాతనిని మఱపించి త్రోవకుఁ దేలేనా! (ప్రకాశముగ) కుమారా! వచ్చినకార్యము చెప్పమఱచితిని. నేఁటియుదయము జయంతాశ్రమమునుండి సందేశము వచ్చినది.

నిరంజ—ఏమి యది? నాయనగారియాజ్ఞకు సర్వధా బద్ధుఁడను.

సుదర్శ—చిరంజీవిని జూచి చిరకాల మయిన దనియు, నిన్నుఁ దోడ్కొని జయంతమునకు నన్నొకమాఱు రమ్మనియు రాజశేఖరమహారాజుగారు సందేశ మంపిరి.

నిరంజ—అవశ్యము పోవుదము.

సుదర్శ—ఎవఁడురా అక్కడ? జయంతాశ్రమమునకుఁ బోవునేర్పాటులు గావించునట్లు శివదాసుగారితోఁ జెప్పుము.

నిరంజ—(మంత్రిగారికి నమస్కరించి) శివదాసుగారితో మాటలాడి యిదే నేనును బయలుదేఱుచున్నాను. మీరును సిద్ధము కండు.

(అని నిష్క్రమించును. తక్కినవారును నిష్క్రమింతురు. తెరవ్రాలును)

సుదర్శ—(తెరముందునకు వచ్చి) రాజశేఖరమహారాజా! నీ వెంతధన్యుఁడవు! రాజ్యముయొక్కయుఁ, గుమారునియొక్కయు క్షేమము విచారించుభారమును బరిపూర్ణముగ నాయందున్నవని నమ్మితివి. ఈకుమారుఁడు నేఁ జెప్పినమాట వినక యెంత విసిగించుచున్నాఁడు. మనసా! ఎంతకాల మహంకరించి యొరుల దిద్ది తీర్పఁగడంగెదవు? ఎవరి నేమనవచ్చు?

క. తగ దింక జగము గూడఁగ
వగలం బొగులంగఁ దగదు వారిఁ వీరిఁ
దిగలాగఁగ నెగఁద్రోయఁగఁ
దగ దోమనమా గురూక్తిఁ దత్త్వముఁ గనుమా!

నిరంజనకుమారుని గురుసన్నిధానమునకుఁ గొనిపోవుచున్నానుగదా! ఇతనికిక్క తీరిచి సమ్యగ్దర్శనంబు గటాక్షింప వారే సమర్థులు. సద్గురుమూర్తీ! నీబోధామృతపాన మహిమంబుననే సుమా, నే జీవించుట.

ఉ. మాటికిమాటికిన్ గురునిమాటలె జ్ఞప్తికి వచ్చుచుండెఁ గా
మాటము హెచ్చుకొద్ది యనుమానము లేదు వృథాభిమానమే
సూటిగ నెత్తి కెక్కె మధుసూదనుభక్తిని నడ్డగించి నా
నాఁటికి బాధపెట్టెడిని నన్నుఁ గృతార్థునిఁ జేయ దైవమే.

ఉ. శ్రీమహిళాశివాంజలులఁ జెల్వగు నీపదపంకజద్వయిన్
రామ! మదీయమానస సరస్సున హంసల రాకపోకలన్
నేమము మీఱ నాడునటు నిల్పిన దేశికుఁ దత్పరంపరా
కాముల శాంతిధాముల వికారవిదూరుల ధీరులన్ బరం
ధామకళావిశిష్టుల యథావిధిశిష్టుల ధర్మనిష్ఠులన్
గామము దీర్చి యార్చుటకు జ్ఞానవదాన్యుల ధన్యులన్ గుణ
ద్ధాముల రాములన్ గురులదాసుల నెమ్మది మాటిమాటికిన్
నీ మురిపెంపుమూర్తులని నిశ్చలభక్తిని నమ్మి కొల్చెదన్
పామరపావనా! పరమపండితజీవన! జీవధావనా!

(పాటఁగా బాడవచ్చును)

గురునాథ! గురునాథ! సద్ఘనసుందరగురునాథ!
చిద్ఘనసుందరగురునాథ!

(అనుచు నిష్క్రమించును.)

---

## ద్వితీయరంగము

జయంతాశ్రమము - (ప్రవేశము ధర్మాంబ ఆశ్రమప్రాంగణమున)

ధర్మాంబ—(కుమారునిఁ దలఁచుకొనుచు) చిరంజీవి మనోవృత్తి యెటుల నున్నదో! తానొక యింటివాఁడై దేవేరితో రాజ్యం బొనరించుచుండ నిశ్చింతతో నేనును గురుసేవ లొనరించుదాననుగదా! ఇంతకును గలవాని కేమయిన పట్టుచిక్కినదో లేదో! పాప మదిమాత్ర మేమిచేయఁగలదు. నేఁటి వేకువను జంద్రగిరినుండి వచ్చిన బ్రాహ్మణునివలన బుద్ధిమతి సదా నిరంజనధ్యానమునఁ బాటలుఁ, బద్యములు నతనిపై నల్లి తద్గుణకీర్తనంబు సఖీజనులకడఁ గావించుచుండునని వింటిని. నిస్తరంగ సముద్రమువలె నిరాకులముగనున్న నామనం బీపుత్రస్నేహమున మిక్కిలి కలఁతఁ జెందినది.

ఉ. ఆసలఁ గోసితిన్, బరమహంసమునీంద్రులఁ గొల్వ రాజ్యమున్
బాసితి, సాధుపద్ధతిఁ దపం బొనరించితి నోర! పుత్త్రుపై
వాసన పోకపోయె, గృహపాశనిబద్ధమ్మాగాకు లేక్రియన్
జేసెద నాత్మచింతనము శ్రీగురుసన్నిధి భక్తియుక్తనై.

అయినా రాజునిస్పృహత నెట్టిదోకాని తనయుఁ డనఁడు, రాజ్యమనఁడు. నాకిందు సద్గురుచరణమే శరణమగు. (అని యాశ్రమమునుండి గోష్ఠీమందిరమునకుఁ బోవును.)

పరమ—(గోష్ఠీమందిరమున 'ఆనందః ఆనందః' అని యానందస్మరణము చేయుచుండును.)

ధర్మాంబ—(పరమహంసను నమస్కరించి)

చ. ఎవనిపదాబ్జముల్ గొలువ నిందుకలాపు ముకుందుఁ గొల్చెఁబో
నెవనియపాంగవీక్షణ మదీశునిఁ జేయును ఛాత్రకోటినే

నవరసపూర్తిచర్యయ యనారత మిచ్చుఁ ప్రబోధ హార! యా
ప్రవిమలమూర్తి సద్గురుఁ డపారముదం బిడు మాకు నిచ్చలున్.

పరమ—(ఆశీర్వదించును) ఎన్నండును దైన్యమెఱుంగనిదానవు. నేఁడేమి యిట్లున్నావు?

ధర్మాంబ—స్వామీ! మీ చరణయుగళమే నాకు శరణము. అనివార్యమగు పుత్రమోహము నెమ్మది కించుక భంగము కల్పించినది.

క. పుత్త్రాదుల నెఱనమ్మక
రాత్రిందివ మొక్కరీతి రామభజన స
న్మిత్త్రులఁ గూడి యొనర్పఁగఁ
బాత్రత నా కిమ్ము పరమపావనచరితా!

పరమ—సాధ్వీమణీ! నీ త్రికరణశుద్ధికి మెచ్చితిని. నేఁ జెప్పుదానిని వినుము.

క. చేయమి జ్ఞానం బగునా?
చేయుట యజ్ఞాన మెట్లు? చేయఁగవలయున్
జేయుటలోఁ గామనము లే
కేయెడ సుజ్ఞాన మిద్దియేసుమి తల్లీ!

అదిగాక నీ కుమారుఁడు శరమునఁ బుట్టినవాఁడగుటఁ బరమేశ్వరీపాలితుండు. సిద్ధాశీర్వాదకవచితుండు. పెద్దతోవలం బట్టినట్లు కనఁబడినను ధర్మపథంబు విడువకుండు. లెమ్మ.

గీ. త్రిప్పిత్రిప్పిత్రిప్పి తిన్నన నిలుఁ జేర్చు
గోడ్డువెంట నంటి గొల్లవాఁడు
త్రిప్పిత్రిప్పి జీవు దిద్ది ప్రోచును భక్త
తత్పరుండు హరి పరాత్పరుండు.

ధర్మాంబ—చిత్తము.

పరమ—తల్లీ! అచిరకాలంబుననే శారద యను నొక్క మహాయోగిని యిటకు రానున్నది. ఆఁడు తోడు లేక యొంటిగనున్న నీ కామహానుభావురాలితోడి గోష్ఠి మహానందకరంబై యుండు.

క. ఈకలిని జగతి మహిళా
లోకంబునఁ బుట్టువారిలో వింతగదా!
యాకలువకంటిచరితము
సాకుము త్వత్పుత్త్రిఁబోలెఁ జాలఁ జనవునన్.

ధర్మాంబ—మహాప్రసాదము. ఎఱిఁగింపని యభిమానదోష మాశ్రితుల కుండిన నుండుఁగాక. ఎఱుంగఁగలసామర్థ్యము మహానుభావులకుఁ గలదుకదా! అట్టి మహానుభావను బుత్రికగాఁ బడయుటకన్న భాగ్యముగలదే!

(ప్రవేశము రాజశేఖరుఁడు)

రాజశే—

శ్లో. వేదాంతశాస్త్రం బగళామహాస్త్రం
శ్రీభాష్యదాస్యం శివసూత్రభాష్యమ్,
బోధామృతం సాధుజనైకసేవా
రక్షంతు చాస్మాన్ భవసర్పదోషాత్.

(అని నమస్కారముచేయును)

పరమ—(ఆశీర్వదించును)

రాజశే—స్వామీ! తమయాజ్ఞానుసారము చిరంజీవినిఁ దోడ్కొనిరమ్మని సుదర్శనునికడకు నొకబ్రాహ్మణునిఁ బంపితిని. వారును వచ్చువేళయయినది.

పరమ—మంచిది. వత్సా! సోమశిలలోనున్న శారదనుమనయాశ్రమమునకుఁ బిలుచుకొనివత్తునా? యని శర్మ యడిగినాఁడు.

రాజశే—దేవరహస్యము పాప మాతఁడేమెఱుఁగును!

పరమ—(నవ్వుచు) దానికిఁదగిన సంధానము కాలపరిణామమున జరగును లెమ్మ. నీ విందుఁ బ్రయత్నమును మానుము అని మాత్రము చెప్పితిని.

వటుఁడు—స్వామీ! ద్వారమున సుదర్శనమంత్రివరేణ్యులు మహారాజకుమారునితోఁ దమదర్శనార్థము వేచియున్నారు. సెలవైనఁ దోడ్కొనివచ్చెదను.

పరమ—అవశ్యము లోనికిఁ దోడ్కొనిరమ్ము.

(ప్రవేశము నిరంజనుఁడు, సుదర్శనుఁడు. పరమహంసకు నమస్కరింతురు.)

నిరం—

చ. మునివర ! నిన్ గనంగ విడెఁబో ముడి డెందమునందుఁ బ్రీతి మ
జ్జనకునిఁబోలెఁ నన్నును వశంవదుఁగాఁగ ననుగ్రహించి నా
జననము ధన్య మౌనటు ప్రశాంతపథంబున నిల్పుమయ్య నా
దని యిఁక లేదొకింత యిదె యాత్మ సమర్పణ నీకుఁ జేసితిన్.

బుద్ధితెలిసినదాది పెద్దల బోధంబువిన్న యేకొంతకాలమోతప్ప చిత్తవిశ్రాంతి లేక తపించుచున్న నాకు మీకటాక్షము నాపైఁ బ్రసరించినమాత్రమున మనస్సు చల్లఁబడియెను. ఇట్టి చిత్తవిశ్రాంతి నే నిదివర కెన్నఁడు ననుభవింపలేదు.

ఆ. కొంతకాల మైన శాంతి నిచ్చెడునీదు
మూర్తిఁ గాంచనిమ్ము కీర్తిఁ గాంచు
మాయు వల్ప మగుట హాయిగా బ్రదికెద
భక్తకుతుకసాంద్ర పండితేంద్ర !

సుద—(స్వగతము) ఏమీ ! నిరంజనకుమారుఁ డెంతలో మారినాఁడు.

ఆ. సాధుదర్శనంబు సన్మంగళం బను
మాట సత్య మాత్మమహిమ గలిగెఁ
జదువు లెల్ల నిపుడు సఫలత్వమును గాంచె
సకలసంప్రదాయసరణి యారా !

(రాజశేఖరునిచెవిలో నేమియోచెప్పును)

పరమ—(నిరంజనునివంకఁ దిరిగి) కుమారా ! స్వధర్మపరిపాలనంబున నుతికెక్కి సకలసుకవినికరజేగీయమానుండవై పారమహంస్య ధర్మంబునకు రక్షకుండవయ్యెదు లెమ్ము.

చ. సనకసనందనాదులకుఁ జాలినవాఁడు ప్రపత్తిభావనన్
జనకునిఁబోలె యోగిజనసమ్మతుఁడై హరుఁడై విరక్తి నీ
జనకుఁడు పూర్ణదీక్షఁగొని స్వాశ్రితసంశయముల్ హరించు నీ
తనిఁగని మ్రొక్కి చేకొనుము తత్త్వము ధర్మము ధర్మసూక్ష్మమున్.

రాజశేఖరా! తత్త్వార్థియైన నీబుదుతనికిఁ గర్తవ్య ముపదేశింపుము.

రాజశే — చిత్తము. (పరమహంసకు నమస్కరించును)

పరమ — సిద్ధసంకల్పోభవ. (సుదర్శనునివైపునకుఁ దిరిగి) సుదర్శనా! నీవచ్చిన పనిదీరినది. ఆశ్రమారామంబునకుఁ బోవుదము రమ్ము.

(అని యిరువురు నిష్క్రమింతురు)

నిరం —

చ. గురుఁడు గురుండు బాంధవుఁడు కోవిదుఁ డబ్జదళాయతాక్షునిన్
నిరతముఁ గొల్చుభక్తుఁడును నిర్మలవాత్సల్యసరసీరుహుండు సం
సరణమహాబ్ధితారకము స్వామి నిరంతరముత్సరాయణుం
డరమర లేక ప్రోచుత శుభాయతదృష్టిని నన్ను నిచ్చలున్

(రాజశేఖరునకు నమస్కరించును)

రాజశే — కుమారా! “స్వేతరశబ్దావచ్ఛిన్న పురుషై సంగం త్యక్త్వా సుఖీభవేత్ జ్ఞానీ యోగినః” అన్నమాట మఱవకుము. తస్య ఇతరీయులసంబంధమున శాంతి పెను పొందినట్లు, తస్య తతితరసంపర్కమున భ్రాంతియు వృద్ధిఁ జెందును.

క. తనతోడ నైక్య మొందిన
మనుజుల సేవించి వారి మైత్రిని శాంతిం
గను శాంతియ బ్రహ్మ మగుటఁ
గనును గరతలామలకముగా మోక్షంబున్.

అనుగ్రహించు సద్గురుండును, ననురూపయైన సహధర్మచారిణియు, ననుకూలమైన యనుచరవర్గంబును మనంబునకు శాంతి నొసంగుచుండును. ఎవరిసన్నిధానమునఁ ద్రికరణశుద్ధిగ సంచరించుటకు సర్వకాలసర్వావస్థలయందును సాధ్యమో యట్టి యాప్త బృందమందు సుస్థిరుండైన ధన్యుండే లోకులతోఁ దత్తదనురూపముగసంచరించియుఁ గలఁతఁ జెందఁడు.

క. హితముం బ్రియముం దన కెది
హితు లద్దానిని నడుగకయె యొనర్చుచు రా
మతి తగులుంగద యేకా
గ్రతఁ దా సాధింపఁ గోరుకార్యమునందున్.

ఆత్మమనస్సంయోగంబు యోగంబునాఁబడు. పంచేంద్రియంబులకు విషయంబులైన శబ్ద స్పర్శ రూప రసగంధంబులనియెడు నీయయిదర్థంబులు నత్యాసక్తితో నంగీకరించు సుందరీమణితోడి యోగంబు భోగంబు నాఁబడు. భోగంబున మానసికానందమును, యోగంబున నాత్మానందమును గలుగును.

సీ. ఆదినారాయణుపాదాబ్జమందు సం
భవ మొందినమృతంపుబావి మోవి
బ్రహ్మసారంబైన ప్రణవాక్షరంబును
బ్రాణంబుగాఁ దాల్చు ఘ్రాణపుటము
స్ఫటికాకృతిని వెల్గు పరమపూరుషు నిల్పు
నిర్మలతేజంబు నేత్రయుగము
పతిరూపమును దాల్చి సతిరూపమునఁ దేల్చి
వికృతచర్య మెప్పించు మేను
యోగమూర్తియు నతులసంభోగమూర్తి
దానకీర్తియు సానందధర్మవృత్తి
గలిగి వెలిఁగెడుదివ్యవిగ్రహము నాత్మ
భక్తి భజియించుభాగ్యంబు భాగ్యమందు.

ఉపదేశమునకు గురుమూర్తియు, నుపచారమునకుఁ బతివ్రతయగు నారీమణియుఁ నుచితిన ధన్యంబు మోక్షమున కర్హంబు.

ధర్మాంబ—నాయనా!

క. దేశికుఁ డుపదేశమున స్వ
దేశమునకు హంసయాన ధీవృత్తికి నా
వేశము గల్గించి భ్రమల
నాశము జేయంగ దాఁటు నరుఁడు భవాబ్ధిన్.

క. కందం బందము కవితకు
సుందరిహృదయంబు ధర్మసూక్ష్మజ్ఞునకున్
జందురుఁ డందము రాత్రికి
నందఱ కానంద మిద మహా వే యేలన్.

రాజశే—కుమారా! పెక్కేల?

క. శ్రీసద్గురూక్తవిధిని ను
దాసీనుం డాస గోసి యద్ధ్యాసనమం
దాసీనుం డయి ధ్యానము
చేసిన సకలార్థసిద్ధి చేకుఱు జీవా!

(చెవిలో నుపదేశముచేసి)

గీ. ఆత్మతాదాత్మ్యమందున నఖిల విద్య
లణఁగియున్నవి గురుకృప నదియుఁ గల్గఁ
దాను దనయంద నిల్చి సంతాప ముడుగు
జీవ! యావాడఁ జూడుము దేవుఁ డౌదు.

ధర్మాంబ—వత్స! నాయనగారి బోధ మేమరక శుభములఁ బడయుము.

నిరం—మీ యాజ్ఞానుసారంబు మెలంగి కృతకృత్యుఁడనున ట్లనుగ్రహింపుఁడు.

క. తెలియమి పోయినపోకడ
లలయించెఁ మిమ్ము, మంత్రి, నాచార్యునిఁ, గే
వలకృప బోధం బొసఁగిరి
లలితాకృతి నంద ఱొక్కలాగున నాకున్.

(పరమహంసయు, మంత్రియుఁ దిరిగివత్తురు)

నిరం—(నమస్కరించి)

క. జననీ! జనకా! మునివర!
యనుపుఁడు నిజగేహమునకు నాశీర్వాదం
బొనరిచి మంత్రివరునితోఁ
జనెద నతఁడు తోడుగాఁగ సమకుఱు శుభముల్

పరమ, రాజశే, ధర్మాంబ—వత్సా! పోయిరమ్ము, శుభములఁ బడయుము. స్వధర్మ మేమరకుము.

మంత్రి, నిరంజ—ఏమిశాస్త్రిగారు! ఇట్లు వచ్చినారు?

డామా—కడుపుఁబోవుచుఁ గూరరుచి యడుగనేల? నేఁటిమధ్యాహ్నము కాశీ నివాసియగు త్ర్యంబకయోగీశ్వరులవారు రామేశ్వరమునుండి శిష్యసమేతముగ నిటకు వచ్చి విడిసిరి. ఇచటజరుగుచున్న యాగాంగములన్నియు వారు చూచి మిక్కిలి సంతోషపడినారు. ఆదర్శప్రాయులగు చతురాశ్రమధారుల నిచట నిల్పుట మనయాశ యమైయున్నదికదా! తురీయాశ్రమమున నున్న యుత్తమాధికారులు వీరు కావున వీరిని యాగశాలయందు స్థిరముగా నిల్పఁ బ్రార్థించుటకై మంత్రిగా రవశ్యము వెంటనే బయలుదేరిరావలయునని సుశీలమునీంద్రులు కోరుచున్నారు.

పరమ—సుదర్శనా! నీవు త్వరగా వెడలిపొమ్ము. ఆతఁడు క్రమముగా నాశ్రమమునుండి యాశ్రమమునకు వచ్చిన పరిపూర్ణుఁడు. సత్రయాగశాలయందు నిలుపఁ దగిన ప్రామాణికుఁడు.

సుదర్శ—(నమస్కరించి) చిత్తము. మహాప్రసాదము. నిరంజన కుమారుం డును, శాస్త్రియు వెనుకనుండి వత్తురు. నే నిదే పోయివత్తును. (శాస్త్రి చెవిలో నేమియో చెప్పును.)

డామా—నేనువచ్చిన వాయువిమానముపై మీరు పోయి రాజధానిఁజేరి యా విహంగమార్గమునఁ బోవు సన్యాసులగూడవ విచారించుకొనుఁడు. మేము గృహస్థమార్గ ముగఁ గడుపులోనిచల్ల కదలకుండ నెమ్మదిగ వచ్చెదము. (సుదర్శనునితో జనాంతికము) నాసంధాననైపుణ్యమునకు మీరే గండపెండేరము వేయింతురుగాక!

సుదర్శ—పరిహాసము కాదు. పని జరుగవలెను.

(తెరవ్రాలును. డామాడోలీ ముందునకువచ్చి)

డామా—పాట:

దేవుఁడా యని వెదుకనేలర జీవుఁడు
జీవుఁడు మాజీవుఁడు మాభూవిభుని కుమారుఁడు
జీవుఁ డెవ్వఁడు దేవుఁడెవ్వఁడు జీవదేవుల తావదెక్కడ,
భావమున గురుసూక్తి నాటెను దేవుఁ డయ్యెను జీవుఁడోర.

## తృతీయరంగము

(ఉపవనముసమీపము)

(ప్రవేశము డామాడోలి, నిరంజనుఁడు)

నిరం—శాస్త్రీ! ఇదియేమి? ఇటువచ్చుచుంటిమి! మార్గమునం దిరుప్రక్కలనున్న యుద్యానవనములు మనోహరముగానున్నను మనము దారితప్పినట్లున్నది.

డామా—దారితప్పలేదు. ఇపుడిపుడే దారికివచ్చుచున్నావు. అతిశీఘ్రముగా వాంఛితపదమును జేరఁగలవు.

నిరంజ—రాజధానిఁ జేరవచ్చు సూచనలు కానరావు. ఈమార్గమునఁ గానవచ్చు సౌధశిఖరములు రాజభవనములవలెఁ దోఁచుచున్నవి. ఈ యుద్యానము సకలఋతుకుసుమ సౌరభయుతమై పరమాహ్లాదమును గలిగించుచున్నది. మనమిపు డెక్కడనున్నాము శాస్త్రీ!

డామా—ప్రాతదారి కాకపోవుటచేఁ గొంత క్రొత్తగనున్నను జిత్తమునకు వేడ్క లిసురొత్తఁజేయువదియే. ప్రాతదారి యొంటిజందెపుబాట. సన్ననిది. క్రొత్తదారి ద్వితీయసాయముకలది. తోడుగల బాట. కొంచెము చుట్టులఁబెట్టునదైనను విశాలమైనది. తిన్ననిది. మేలని పెద్దలాదారిని నేగుదురు. నేను మిక్కిలి బడలియున్నాను. కొంత విశ్రమించినఁగాని యడుగైన నిడఁజాలను.

నిరం—నీమాటలే చుట్టుగానున్నవి. తిన్నఁగా నర్థమగుటలేదు. నాకును బడలికగా నున్నది. ఈచల్లగాలియం దీచలువఱాతితిన్నెపై నీయుద్యానవనమున నించుక విశ్రాంతి పుచ్చుకొనియే పోదములెమ్ము. నీవును విశ్రమింపుము.

(మలయమారుతసుఖము ననుభవించుచు)

శ్లో. మహాదేవ మహాదేవ మహాదేవ దయానిధే
భవానేవ భవానేవ భవానేవ గతిర్మమ.

(అని రాగయుక్తముగాఁ బాడును)

రాజభోగరమణీయమయ్యు నీయారామము పరమప్రశాంతమై తపోయోగ్యముగనున్నది.

చ. మనమున శాంతి గల్గిన సమానుషశక్తి ఘటించు సంచితం
బనుపమలీల డుల్లుఁ బరమాత్ముని దర్శన మబ్బు మబ్బుపో

కనుఁగొను మూర్తి సత్కృపను గాఢవిరాగము కల్మి తాల్మి శో
భనముల కాటపట్టనుచుఁ బల్కురు తెల్లఁగ విందు మిత్రమా.

దావా—సందేహమేమి? ఇదియే నీ కింక శోభనపరంపరల కాటపట్టగుసు
లెమ్ము.

(చెట్టుమీఁదనుండి చిలుక)

సుగంధి:—“నిరంజనా! నిరంజనా! మునిప్రగీతభావనా!”

నిరం—నన్నెవ రిక్కడఁ బిలిచెదరు?

దావా—నల్లచీరఁ గట్టుకొన్న వారెల్ల నా పెండ్లాలే యనుకొనెనఁట నీవంటి వాఁ డొకఁడు. ఇన్ని దినములనుండి యింతబరువుఁదోఁచిన పేరిపుడు నీ కింత ప్రియమయినదా! మహానుభావ కృతసంతత శివస్తోత్రము ననుకరించుచున్న చిలుకల పలుకుల కులికి నన్నెవరో పిలుచుచున్నా రనెదవేల?

నిరం—చిలుకలా! శాస్త్రీ! నిజమా, ఇది శివస్తోత్రమా?

చిలుక—“నాకు నిరంజనుండె శరణంబు ప్రశాంతిభవంబుఁ దాఁటఁగన్.

నిరంజ—(ఆశ్చర్యముతో వినును)

చిలుక—“రతిపతిఁ గెల్చి మించెద నిరంజనుఁడే కృపఁజూచి ప్రోచినన్.”

నిరం—ఎంత భక్తిభరితములైన వీ పద్యపాదములు! పాప మా చిలుకలు నిండుపద్యములఁ బాడలేక పాదములుమాత్రము పలుకుచు ధ్యానముచేసినవారి భక్తి పారవశ్యమును బ్రకటించుచున్నవి. ఏ మహర్షియైన నింగుఁ దప మొనరించుచున్నాఁడా యేమి?

(సమీప నికుంజమున సంగీతము వినవచ్చును)

పాట—కాంభోజరాగము—మిశ్రజాతి, యేకతాళము

పల్లవి—విశతు విశతు విశతు

అనుపల్లవి—విశతు మన్మానసరాజహంస
శ్శంభో! విశతు విశతు విశతు.

౧. నిత్యధ్యానే! నిరభిమానే!
మహాపానే! గురుతీర్థపానే. వి.

౨. సంకల్ప్యాక్రాంతోపితద్వా చక
జపమత్యంతం కుర్వే కుర్వే. వి.

౩. సాక్షాదనుభవసమయే సత్యం
భుక్త్వాహంసఃముక్తః శక్తః. వి.

౪. తా దేవఖలు దేవము దేసత్యం జీవా
నామిత్రిశూయ తేనగధరసద్గతే. వి.

నిరం—ఏమి భక్తిపారవశ్యత! ఏమి యీ భావగంభీరత! ఏమి యీ రసోద్రేకము! సంగీతకోవిదు లెందఱు మన యాస్థానమున లేరు? ఈ గానము కేవల నాదోపాసనముం బోలె మనస్సును హరించుచున్నది.

డామా—జ్ఞానయోగములు మానుషాకారమును దాల్చినవా యన్నట్లు వెలుంగుచున్న యామూర్తిని నీవు సేవించిన శక్తిసంపన్నుండవై ముక్తికాంతను జెట్టఁబట్టఁగలవు.

నిరంజ—ఏమిది, నేఁడు నీమాటలన్నియు వ్యంగ్యప్రధానములు, శ్లేషలుగానున్నవి.

డామా—నేనేమి యలంకారశాస్త్రము నభ్యసించితినా! అద్దము ముఖము యొక్క యాథార్థ్యమును గోచరింపఁజేసినట్లు నేనును నున్నదున్నట్లుఁ దెలుపువాఁడను. శ్రవణమాత్రముననే యావ్యక్తిపై నింతమనసు పాఱియున్నదే. మీ యుభయులకు సంగతియే కలిగిన మహాభోగులుకారా!

నిరంజ—(స్వగతము) మహాభోగియన మహాయోగియేకదా! (ప్రకాశము) నీ కపటపుమాటలు నా కర్థమగుటలేదు.

డామా—ఇంతకుము న్నెన్నఁడును గనఁబడని యుత్సాహము నేఁడు నీ మోమునఁ దాండవమాడుచుంట చూచినపుడు నాకు మేనిపైఁ బటమేనిల్చుటలేదు, నీయెడఁ గపటముగూడ ధరింపఁగలనా తండ్రీ! నీయుల్లాసమునకుఁ గారణము పరమహంససన్నిధినిఁ బడసిన జ్ఞానమా, లేక యిమ్మనోహరవ్యక్తివలన నీ యారామమందు వెలువడిన గానమా? ఏదైననేమి? ఇమ్మహానుభావదర్శనంబునఁ గృతార్థులమయ్యెదము గాక. నే నిదేపోయి పువ్వులఁ దెచ్చెదను. (అని పోవును).

నిరం—నేఁడేమో మహాతపఃఫలము హస్తగతంబైనవానికింబోలె నామనం బుబ్బి గంతులువైచుచున్నది. పాపము నాయందు నిర్వ్యాజప్రీతికలవాఁ డగుటచే

శాస్త్రియు ననుఁజూచి యుపేక్షించుచు మేనిపైనఁ బటమేనియు నిలువ దనుచున్నాఁడు. ఆహా! ఎవనియులుకు వానిదికదా! పటమనఁగానే నాపడకటింటిపటము నామోమున వ్రేలుచున్నది. నా యైచ్ఛికబ్రహ్మచర్యనియమము నేటితో వదలిపోయినదికదా! స్వధర్మాచరణమందు సహధర్మచారిణిని గ్రహించుటయే నా జనకుని యుద్దేశము. ఆ పటమునందలి వ్యక్తియాకారముఁదాల్చి నాకు సాక్షాత్కరింపరాదా! హే రాధా రమణా! నీ వట్లనుగ్రహించిన "పద్మావతీ చరణచారణచక్రవర్తి" యగు శ్రీ జయ దేవునింబోలె మే మిరువురము నీకైంకర్యము సలుపుచుండమా!

(తెరలో దూరమునుండి వినవచ్చును)

పాట. కన్నడరాగము - ఆదితాళము

ధ్యానలయేనపురః పరికల్ప్యభవన్తమతీవదురాపం- విలపతి,
హసతి విషీదతి రోదితి చంచతిముంచతితాపం-సావిరహేతవదీనా.

నిరంజ—ఆహా! ఏమి నాపుణ్యము! నేను పద్మావతీజయదేవులను స్మరించిన మాత్రనే నాకు జయదేవగీతగోవిందచరణము వినవచ్చినది. శుభసూచనసుమా యిది. శాస్త్రి యామహనీయుఁడు శివభక్తుఁడని వచించెఁగదా! నిక్కమగు శివభక్తికి నిర్వి చారమగు కేశవస్తోత్రమే గురుతు. కలస్వనమేకాని కంఠమదికాదు. భక్తులు మరి కొందరు గోష్ఠికై చేరిరికాఁబోలు.

(డామాడోలీ పువ్వులు కోయుచుండఁగా)

కలవాణి—"సావిరహేతవదీనా" (అనిపాడుచుఁ బ్రవేశించును.)

డామా—నీవేనా కలవాణి! పాడుచువచ్చుదానవు?

కలవాణి—నేఁడుకదా సుదినము. మా భావగారి దర్శన మయినది. మహాత్ము లూరకరారు. మా చెలిసంగతి యేమిచేసితిరి? నిన్నటినుండి మాప్రాణసఖి నిరశనవ్రత మారంభించి గీతగోవిందముతోఁ గాలక్షేపము చేయుచున్నది. ఒక్కొక్కయెడఁ దాను రాధననియు, నిరంజనుఁడు కృష్ణుఁడనియుఁ గల్పించుకొని యూరక పాడుచుఁ దన్మయావస్థయందున్నది. ఆమె యలసినపుడు మే మాగీతములఁ బాడుచున్నాము. ఇపుడు నేపాడినపాటలో నతిశయోక్తి యేమియు లేదుసుమా! నిరంజనకుమారుని చిత్తవృత్తి యెట్లున్నది?

డామా—ఉస్! నిరంజనకుమారుఁడు వచ్చియేయున్నాఁడు. ఇపుడే మీ చెలియున్నచోటికి రాఁగలఁడు. సముఖమున రాయబారములేల? ఎదుటికివచ్చిన ప్రియునిఁ గైవసమొనరించుకొనుట తనపనియని మీప్రాణసఖి నుద్బోధింపుము.

బుద్ధిమతి—

ఆనందభైరవిరాగము - త్రిస్రరూపకము

"కథితసమయేపి హరిరహహ నయయౌ వనం

మమవిఫల మిదమమలమపి రూప యౌవనం

యామి హే కమిహ శరణం సఖీజనవచన వంచితాహం.

కలవాణి—(ఆలకించి) అదిగో చెలి తిరిగి పాడుట కారంభించినది. సోలిపోవు నేమో యని భయమగుచున్నది. నేఁబోయెదను. (అనిపోవును)

బుద్ధిమతి—

యదనుగమనాయ నిశిగహనమపి శీలితం

తేనమమహృదయమిద మసమశరకీలితం

యామి హే కమిహ శరణం.

నిరంజ—ఓహో! ఏమి రసావేశమునఁ బాడుచున్నాఁడు. మహాభక్తులు కొందఱు తాము రాధయనియు, భగవంతుఁడు నాథుఁడనియు భావనము చేసికొనుచుఁ దాదాత్మ్యసిద్ధికై స్త్రీవేషమునుగూడ ధరింతురని వింటిని. పురుషులలోనే పరమార్థము శూన్యమయిన యిక్కాలమున స్త్రీలలో నది గానవచ్చుట యసంభవము. కాని గానము స్త్రీగానమువలె సుకుమారముగా నున్నది. ఇంతకు నామనం బమ్మహావ్యక్తినిఁ జూడ దత్తరపడుచున్నది. (వినుటనటించి) ఏమది! మరల పాట వినఁబడుచున్నది.

బుద్ధిమతి—

మమ మరణమేవ వర మితి వితథ కేతనా

కిమితి విషహామి విరహానల మచేతనా

యామి హే కమిహ శరణం.

(భావోద్రేకంబున)

మమ...మరణం...మరణం...మరణ మేవ... ఏవ వరం మరణమేవవరం... మమ మరణమేవవరం—హాకృష్ణా! వేణుగానప్రియా! (అనుచుఁ బానుపుపై నున్న దిండుపై నొరగి కనులు తేలవైచును.)

కలవాణి—(స్వగతము) రాధికాతాదాత్మ్యము చెలికిఁ బారవశ్యము కలిగించినది. నేననురూపముగఁ బ్రవర్తించెదను.

(ప్రకాశముగ బిగ్గఱగా)

పాట—

క్షణమధునానారాయణం అనుగత మనుసర రాధికే!
కరకమలేనకరోమి చరణమహామాగమతాసివిదూరం! క్షణ
ముపకురు శయనోపరిమామివ నూపుర మనుగతిశూరం. క్షణమ.

బుద్ధిమ—హరిహరీ యెంతమాట! అంతటియపచారమును జేయుదునా! నేనే మీ చరణసరోజసేవ చేయుదును!

నిరంజ—శాస్త్రీ! ఏల జాగుచేయుచున్నావు? (స్వగతము) నేనిదే శాస్త్రినిఁ బిలువఁబోయెదను.

కలవాణి—చెలీ! చెలీ! నీవు రాధవుకావు. నీవు బుద్ధిమతివి. ఒక్కమారు కన్నెత్తిచూడుము.

ఉ. పండెఁ దపంబు బుద్ధిమతి వచ్చె నిరంజన భూవిభుం డిదే
పెండిలికూఁతువైతి వీఁక బేలతనంబును మాని పుష్పకో
దండుని బాఱి కగ్గమగుదాన నినుఁ శరణంటి నన్నుఁ జే
కొండని యర్పణంబు నిడుకొన్నఁగదా చెలి మేలు కల్గెడున్.

బుద్ధిమతి—

ఉ. ఎక్కడిమాటలే చెలియ, యేటికివచ్చు నిరంజనుండు శ్రీ
వెక్కసమైన వానికట వేడుక పెండిలి, నాకు వానిపై
మక్కువ మానరానిదయి మానసముఁ నొగిలింప నేరికిన్
మ్రొక్కుదు మొఱ్ఱవెట్టు దెటుఁగోవుదుఁ బుట్టితి రాచదాసనై.

కలవాణి—

ఉ. వేడుక మాటలాడుదునె వింటివి వానిసఖుండుఁ దెల్పఁగా
నేఁడు జయంతమందున మువిగ్గనినంతనె పూర్వవాసనల్
వీడి గృహస్థధర్మపదవిన్ గయికొంటకు బాసచేసి యు
న్నాఁడఁట నీదు మూర్తి మననంబెద సల్పెదునంట నమ్ముమా

బుద్ధి—"సఖీ! జీవన్ భద్రాణి పశ్యతి"

గీ. ప్రాణములు దాల్చియున్న సత్ఫలముఁ గొంటిఁ
బ్రాణనాథుని సత్కృపఁబడయఁగంటిఁ
బ్రాణసఖి నీదు సంధానపటిమ మంటిఁ
బ్రాణదాత నిరంజనప్రభుఁడె యంటి.

నే నెంత ధన్యురాలనే! నా మనోహరుండు నా కెపుడు నేత్రపర్వము గావించును?

కలవా—ఈపాటికి వచ్చుచుందురు.

బుద్ధి—మనమా! తత్తరపడకుము. ప్రాణవిభు నర్హరీతి నర్చించి తత్కృపను గాంచఁగలవు.

నిరం—శాస్త్రీ! శాస్త్రీ!

డామా—నాయనా! నాయనా! వచ్చితి వచ్చితి. ఇదిగో పూవులుఁ దెచ్చితి.

నిరం—మహానుభావదర్శనమునకుఁ బోవుద మేటికిజాగు?

డామా—(స్వగతము) ఆహా! భగవత్సంధాననైపుణ్యము! నెట్టికొనివచ్చి దంపతులఁ గూర్చుచున్నది. (ప్రకాశము) ఇటు, ఇటు.

నిరం—(పరిక్రమించి యెదుట కొంతదూరముననున్న బుద్ధిమతింగాంచి యాశ్చర్యముతో) ఏమిది, నా హృదయసింహాసన మధిష్ఠించిన దేవతయే నాయెదుట సాక్షాత్కరించినదా! శాస్త్రీ! ఇదియేమి కలయా! ఇంద్రజాలమా! నాటకమా! చిత్తవిభ్రమమా! భజనమా! తపమా! ఆరాధనమా! ఏమి యీ యపూర్వప్రయోగము!

సీ. కాఁబోలు నిది నూత్నకమలంబు కాదుపో
జడవృత్తి లేమినే జూడఁ జూడఁ
గాఁబోలు నిది సుధాకరమూర్తి కాదుపో
తేటిచూచినయేనిఁ దెల్లఁబోమిఁ
గాఁబోలుఁ గనకవిగ్రహ మిది కాదు పో
పద్మగంధంబునఁ బరిఢవిలుటఁ

గాఁబోలునిది చిల్కగవిశన కాదుపో
శుకహీనసకలవచోభివృద్ధి
గీ. అవునుగాకేమి యిది నిశ్చయముగమరుని
రత్నబాణాసనము శరీరరహితుండు
గానఁ గానంగరాఁ డనుమానము ననఁ
దెలియవలయును ధీరులఁ గలచుచూపు
తూపులనుఁ దీవ్రగతిదానఁదొడగుచుంట.

డామా—ఏటి కింక విలంబము? ఆ యెదుటనున్నది నీకై ప్రాణములు నిలుపుకొని నిరాహారంబుగ ఘోరతపం బొనరించుచున్న నీమేనమామ కూఁతు రగు బుద్ధిమతి సుమా!

కల—మహారాజా! స్వాగతము. స్వాగతము.

సీ. కాత్యాయనీపాదకంజంబు లర్చించుఁ
జర్చించు వేదాంతశబ్దసరణి
నర్పించు నజపంబు నాయాస్థలంబుల
దర్పించుఁ గవిజనధాటిసూటిఁ
జాలించుఁ గర్మంబు నాలించునాదంబు
సోలించు నిజనాథు సోమనాథుఁ
బాలించు భక్తాళి భావించు ముక్తాళి
ధ్యానించు గురుమూర్తి ధర్మవర్తి
గీ. జ్ఞానయోగకరంబుల గాఢరక్తిఁ
బూజ నినుజేయుచున్నట్టి బుద్ధిమతిని
వలచుదానిని మఱఁదలివరుసదాని
దీని భూజాని యేలు నీదానిఁగాఁగ.

ఈ కుంజకుటీరంబున నీయాసనంబు నధిష్ఠింపుఁడు.

(నిరంజనుఁడు, శాస్త్రి, లోనికరిగి యాసనము నధిష్ఠింతురు.)

(బుద్ధిమతి లజ్జావనతవదనయై నిలువఁబడియుండును)

నిరంజ—మీ చెలిచరిత్రమువోలె ని య్యారామనికుంజంబును మనోహరంబుగ నున్నది.

కలవాణి—చెలీ! బుద్ధిమతీ! పరోక్షమున నెవ్వానికై నీవు ఘోరముగఁ దపించి నిరీక్షించుచుంటివో, యట్టి నీ ప్రాణవల్లభుండు నిరంజనమహారాజు పరమానుగ్రహంబున సాక్షాత్కరించియుండ నిర్హేతుకముగ జేలనై యేల యర్ఘ్యావిధులఁ బూజింప జాలము చేసెదవు?

ఈ బ్రాహ్మణోత్తముని యాశీఃప్రభావముసుమా! నీ కీమహారాజు దర్శనలబ్ధి.

బుద్ధి—బ్రాహ్మణోత్తమా! మీచేసిన మేలున కేమి యుపకృతి యొనర్పఁగలదాన! నే నిదే నమస్కరించుచున్నాను.

డామా—శీఘ్రమేవ నిరంజననృపాల కరగ్రహణప్రాప్తిరస్తు. మాతల్లీ! నీవు మహారాణివై యెల్లప్రజలనుఁ జల్లఁగనేలుము. మల్లెపందిలిక్రింద నాదేవతార్చనపెట్టె మఱచితిని. తెచ్చుకొని వచ్చెదను. (అని నిష్క్రమించును.)

కలవాణి—భావగారెందులకో తొందరగాఁ బోవుచున్నారు. ఇదిగో ఒక్కమాట, నేనును వచ్చుచున్నాను. (అని యతనివెంటఁ బోవును.)

బుద్ధి—కలవాణి! కలవాణి!

కలవాణి—రాజసన్నిధానము చిక్కిన నీకు నాతో నక్కఱయేమిలే! మా బావగారితో నొక్కమాట చెప్పివచ్చెదను. నీవును మీబావగారినిఁ గుశలప్రశ్న చేయుచుండుము.

బుద్ధి—ఒక్కమాట విని పొమ్మా. (అని తోడఁ బోఁబోవఁగా నిరంజనుఁడు చేయిపట్టుకొని నిలుపును.)

చిలుక—

"రతిపతిగెల్చి మించెద నిరంజనుఁడే నను జెట్టఁబట్టినన్."

బుద్ధి—ఈ చిలుకలకుఁగూడఁ బరిహాసపాత్రమ నైతి. బుద్ధిలేనిజీవు లివి. సమయము సందర్భము నెఱుంగక నోటికివచ్చినట్లు కూయుచున్నవి.

నిరంజ—ప్రాణప్రియా! నీచే రచింపఁబడిన యీ పద్యపాదములు వింటినిగాని శివస్తోత్రమని భ్రమించితి. ఇన్నిదినములు నీహృత్తాపమునకుఁ గారణభూతుండనైతిఁ

గదా! ఈచిలుకలు బుద్ధిమాలినజీవులు కావు. నీ హృదయమెఱింగి నా కెఱింగించెను. ఇంతటిభక్తి నాయందుఁగల నిన్నెఱుంగఁజాలనివాఁడనౌట నిక్కము. నే నట్టివాఁడ నగుదు. నీవు బుద్ధిమతివి.

క. నాతప్పులు సైరింపుము
శీతాంశుముఖి నినుగొలిచి కృతార్థత్వం
బేతీరునైన ద్వంద్వా
తీతపథంబుననె నడిచి ధీరత కందున్.

ప్రేయసీ! జయదేవులకుఁ బద్మావతింబోలె నీవు నాకుఁ దోడుగా భగవద్భాగవత కైంకర్యంబు సలిపి లోకోత్తరుండ నయ్యెదఁగాక!

క. నీ విటు తపింతు నాకై
కావించితిఁ దపము నిన్నుఁ గాంచుటకై నే
సేవింతు నిన్ను ముదమునఁ
గావింతుము మీఁదఁ దపము కైవల్యమునన్.

బుద్ధి—సకలకళావిశారదులగు మీరు నమ్ముకొనియున్న నావంటి దీనురాలిని వంచించుట యొక ఘనకార్యమా!

నిరంజ—శివ! శివ! ఎంతమాట. నిన్ను నేను వంచింతునా! అహర్నిశంబు నిన్ను నే ధ్యానింతు ననుట కీశ్వరుండె సాక్షి.

బుద్ధి—ఒక్కపుణ్యాత్మురాలి పటమును సంతతముఁ జెంత నుంచుకొని మీరు ధ్యానించుచుందు రని వింటిని.

నిరంజ—(స్వగతము) నాగుట్టిమె కెట్టు తెలిసినదో! శాస్త్రి యసాధ్యుఁడు.

బుద్ధి—నామకుక్కవమాట కేమి? అన్యథాలగ్నమైన తమ మానసమునకు నిర్బంధము కలిగింతునా?

నిరం—ప్రేయసీ!

గీ. పటమునసెకాదు మచ్చిత్తఫలకమందుఁ
జిత్రితంబైన యాసచ్చరిత్ర యెవరో

నీవ చూడంగరాదె యిందీవరాక్షి
దాపరికమేల యిదిగో ప్రత్యక్షముగను.
(అని పటమును జూపును)

(బుద్ధిమతి పటమునుజూచి సంతసపడుచు సిగ్గుపడుచుండఁగాఁ జెంతనున్న యద్దము నాతఁడామె మోమునకుఁ బట్టును.)

బుద్ధి—ఈదీనురాలింతగాఁ దమ యనుగ్రహమునకుఁ బాత్రురాలైనదని యెఱుంగక నేనేమి యంటినదియెల్ల క్షమింపవేఁడెదను. ఇంతదయతో నన్నంతరంగమున లాలించు మనోహరుని మానసం బరయఁజాలని కటికదానిమోమున కద్దమొకటి కొదువయా!

నిరం—ప్రేయసీ! ఈయద్దమున నీ మోమెటుల స్పష్టముగఁ బ్రతిఫలించుచున్నదో నిర్మలమైన మద్ధృదయంబున సంతతము నీయాకారము హత్తియున్నది.

శా. నాకాధారము సర్వతంత్రముల సన్మార్గంబు సూచింపఁగా
నీకారుణ్యముకన్న వేరుకలదే నిశ్చింతతో నన్ను వే
గైకొమ్మా రతనంపుబొమ్మ కృపతోఁ గైవల్య మిమ్మా యిదే
నీకున్ దాసుఁడ నీకు దాసుఁడయితిన్ నిక్కంబు ప్రాణేశ్వరీ!

(అని బుద్ధిమతి ప్రక్కకుఁ జేరఁగ నద్దములో నిరువురి ప్రతిమలు కనఁబడఁగ సిగ్గుపడి బుద్ధిమతి యావలపోఁగా నిరంజనుండు ముద్దుపెట్టుకొనఁబోవును).

(పైనుండి పువ్వులు వారిరువురిపై వర్షించును. తెర వ్రాలును.)

# హంసవిజయము

## చతుర్థాంకము

---

(విష్కంభము)

కన్యాకుమారికిఁ బోవు దారి.

మోటారులో నారాయణభట్టు, భార్యయు నుందురు. అన్నంభట్టు పశ్చాత్తాపముతో మోటారువానికొఱ కెదురుచూచుచునుండును.

పాట

(కాంభోజి - అటతాళము)

అన్నంభట్టు—

1 ఎన్నెన్నో మాటాడి యెందఱినో వేఁడి
యెట్టెట్లోఁ బడితి.

2 వన్నె వాసియు లేక, వరహీన మాపోకఁ
గన్నెఱికముకన్నఁ గడుహీనమే యెన్న.

3 తార్చి మనోరమ, మార్చి స్వమతము
పేర్చి పాపసమితి, నార్చితి జ్ఞానాగ్ని.

4 హరిహరి నీతత్త్వ, మరయక లోలత్వ
పరుఁడనై నీచత్వ,పరత దాసత్వాన.

5 కాసుమాత్రకుఁ దార్చి, కడు కష్టముల కోర్చి
తల నన్నిటిని దూర్చి, కులము పోకార్చి.

6 ధర్మశాస్త్రము వీడి, మర్మశాస్త్రముఁ బాడి
కర్మమార్గము వీడి, దుర్మార్గులను గూడి. ఎన్నెన్నో.

హా శ్రీహరీ! పుట్టిననాటినుండియు నేకొంతయు నెఱుంగక మహారాజకుమారునితోఁ బెరిగి పెద్దవాఁడనై యాతనిచెలికాండ్రందఱిలో నాతనికిఁ గడుఁ గూర్చువాఁడనైతి. నామనోదౌర్బల్యమునఁగదా! దిద్దువాఁడు లేక దూరదేశమున హద్దుమీఱి సంచరించి మహారాజు పంపుద్రవ్యమునుఁగూడ నాపత్తువ్యసనవ్యయములకుఁ జాలక, డర్బీ గుఱ్ఱపుపందెములలోఁ దెసవచేసి "భ్రష్టస్య కావా గతి" యన్నరీతి, చెడి, పడి, చావు తప్పి కన్ను లొట్టపోయి, యొట్టెట్టులో బ్రదికి బైటఁబడితిని. అతనిబలమునఁగదా! విదేశములందుసయితము సకలసంస్థల, సంఘముల, సంస్థానముల మెలఁగఁగలిగితిని. మొన్న నిరంజనకుమారునితో సమావేశమయి సంభాషించువఱకు నేనుఁ గని పెట్టివచ్చినమార్గము లే మార్గము లనియు, నేఁ జదివినవియే గొప్పగ్రంథము లనియు, భరతఖండమున బుద్ధిమంతు లవలంబింపవలసిన సిద్ధాంతములుఁగాని, చదువఁదగిన గ్రంథములుకాని లే వనియు, దృఢముగ నమ్మియుంటిని. ఇచ్చటికి వచ్చిననాఁటనుండియు నిరంజనకుమారుఁడు తాను సద్గురువులవలన నెఱిఁగి యవలంబించుచున్నమార్గములు, బోధములజాడలు తెలిసినకొలఁదియు నాయభిప్రాయములు మాఱుచున్నవి.

బుద్ధిమతీదేవి నిజముగ దేవత గాని మానవస్త్రీ గాదు. ఆ వినయము—ఆప్రీతి—ఆ మార్దవము—ఆయోర్పు—ఆభక్తి—ఆయాలుమగలయానుకూల్యము — లోకమునం దెచ్చటను గానరాదు. అట్టి మహాపతివ్రత లుందు రని పాశ్చాత్యదేశవాసు లూహింపనైన నేరరు కదా! నిరంజనకుమారుని నామె ఛాయవలె ననుసరించును. చనవున బుజ్జగించి పతి త న్నడిగినపుడు క్రొత్తపెండ్లికూఁతురు కోరఁదగిన దెన్నేని యుండె మీసేవకంటె నేఁ గోరఁదగిన దేది? య న్నడిగితిరి గానఁ జెప్పెదను. మీతోఁగూడఁ దీర్థయాత్రకుఁ బోవలయు నని యున్న దని తనకోరిక వెల్లడించిన దాయిల్లాలు!!! నిరంజనుఁడు వెంటనే మంత్రి సుదర్శనుని రావించి, మేము తీర్థయాత్రకు బయలుదేఱఁదలఁచితిమి. ఈయున్నంభట్టును బూర్తిగ మాఱినాఁడు. ఈయాత్ర పరిపూర్తి కాఁగానే యాతఁడు మీస్థానము నలంకరించి మీకుఁ దపస్సు చేసికొనుటకుఁ దగు విశ్రాంతి నొసంగును. మీఋణము నేఁ దీర్చుకొనలేను అని చెప్పి నిర్వ్యాజకరుణతో నన్ను మంత్రినిఁ జేసెను. మొదటఁ గన్యాకుమారి కేఁగి యచటనుండి క్రమముగాఁ దక్షిణ తీర్థముల కేగుట కేర్పాటు చేసి రాజదంపతులును, డామాడోలీయు వాయువిమానముపై నరిగిరి. ఐరోపాప్రవాసమునందు నాకై దిగులొందెడి శోషించిన మజ్జననీజనకులతో నన్ను మోటారుపై రమ్మనిరి. ఈపటికిఁగాని వారిని నేఁ గలయఁజాలను. ఆ రాజదంపతు లీసరికి సముద్రతీరంబునఁ బ్రశాంతముగ బ్రహ్మానుసంధానముఁ జేయుచుందురు.

# చతుర్థాంకము

(ప్రవేశము నారాయణభట్టు.)

నారా—నాయనా! నాయనా! మమ్మనాథులనుఁ జేసి యీనట్టడివిని డించి మరల నేసీమకైనఁ బోవ నాలోచించుట లేదుగదా! బుద్ధిమంతుఁడ వయ్యెద వను కొనుచున్న నాయాశాలతలఁ ద్రెంపివైచితివి తండ్రీ!

అన్నంభ—వచ్చితి. వచ్చితి. ఏ మిట్లు చీకాలున లేచి వచ్చితిరి? అమ్మ యింకను నిద్రఁ బోవుచున్నదా! మోటారుచమురుకొఱకు వెళ్లినవాఁ డింకను రాలేదు. ఇప్పుడే యొకపావుగంటలో బయలుదేఱెదము. అమ్మను సుఖముగ నిద్ర పోనిండు.

నారా—నిద్రా! పాడా! శోషయేమో! దెబ్బఁదిన్న ప్రాణములు కావా నాయనా! నేను గనులు దెఱచి చూచుసరికి నీవు కనఁబడలేదు. నాగుండె పగిలి పోయినది. మహారాజు చిరంజీవి నీకు నిజమైన మిత్రుఁడై, మాపాలిటి దేవుఁడై, నిన్నుఁ దిరిగి మాకంటికి కగపఱచి, మాకుఁ బుత్రభిక్ష పెట్టినాఁడు. ఈకత్తెరజుట్టు, ఈతుమ్మెద మీసలు, చుట్టలు, లాగు, టోపి, ఈమాలవేష మంతయుఁ గన్యాకుమారికిఁ బోయిన వెంటనే వదలి స్వచ్ఛమైన బ్రాహ్మణుఁడ వయ్యెద నని యాశపెట్టినది నిజమేకదా! బాబూ!

అన్నంభ—(స్వగతము) విదేశముల సకలసౌఖ్యములలోఁబడి నేనుఁ దిరిగి దేశము వచ్చుటకు నిక్కముగా రాజకుమారుఁడే కారణము. అతఁడు పట్టు పట్టకున్న నాగతి యేమైయుండెడిదో? (ప్రకాశముగ) నాయనగారూ! మీ కింకఁ జింతవలదు. మీ సేవ నేమఱను. మీ కేకొఱంతయుఁ గలిగింపను. బండి సిద్ధముగ నున్నది. రాజకుమారుఁ డీసరికి కన్యాకుమారి చేరి మనకై యెదురు చూచుచుండును. (నారాయణభట్టు నిష్క్రమించును.)

ఉ. నాటికి నేటికిన్ బరమనాస్తికబుద్ధి యొకండు సూటిగా
నాటె హృదంతరాళమున నాగతి యింకెటు తెల్లవార్చెదో
కైటభవైరి! జీవులకుఁ గారణభూతుఁడ వీవ యయ్యు నా
బోఁటుల నేల? యివ్విధిని మూఢులఁ జేసి రమింతు వింతగాన్.

(నిష్క్రమించును.)

(తెర వ్రాలును.)

## ప్రథమ రంగము

(సోమశిలా క్షేత్రము, పినాకినీతీరము)

(ఇసుకతిన్నెపైని జలువతాతిపైఁ గూర్చుండిన శారద ప్రవేశము.)

(తెరలో)

(హరహర మహాదేవ! శంభో శంకర! నమః పార్వతీపతయే హరహర మహాదేవ!)

శారద—తెరదేయూరు తిరిగి యాలయము చేరిన ట్లున్నది. జనులు కరతాళ ధ్వనులు చేయుచున్నారు. ఒక్కొక్క రొక్కొక్క రీతిగ సంతోషపడుచు నీయుత్సవమున నానందపారవశ్యమును జెందియున్నారు. విచారించిచూడఁ బండితుల పాండిత్యమునందుకంటెఁ బామరుల భక్తిలోనే యెక్కువ చిత్తశాంతి యున్నట్లున్నది. ఊరూర జను లందఱు నుత్సవములతోఁ దెల్లవాఱినది. నాకుమాత్రము జాగరణముతోఁ దెల్లవాఱినది. అదిగో! కోడి కూయుచున్నది.

క. సోమశిలా క్షేత్రంబును
సోమేశ్వరుదర్శనంబు శోభనగంగా
భోమజ్జన మేకాంతము
నేమంబు నొసంగ వౌర నెమ్మది మదికిన్.

శాస్త్రవిజ్ఞానము, నాయనర్గళమగు కవితాధార, మత్కృతగ్రంథంబులు, నన్ను మెచ్చుకొని యిచ్చకములాడి లాలించు నెచ్చెలులు, నాయందుఁ బెద్దతికముంచి నాకు శిష్యులమని, శిష్యరాండ్రమని చెప్పికొని గౌరవమునొందు ననుచరవర్గముఁ, బత్రికలలో నన్నుగుఱించి వ్రాయఁబడు ప్రశంసలు, నాదేశాటనము మొదలగువానియం దొక్కండేని నాకు నానందమును, శాంతియు నొసంగ సమర్థంబులుఁ గావయ్యె.

అనిర్వాచ్యమై యెద్దానను దీఱని యీసందేహ దవానలంబు నేఘనుఁడు తన బోధామృతవర్షంబునఁ జల్లారఁజేయునోకదా:

క. వ్యాసముల వ్రాసితిని బలు
బాసల నేర్చితిని శాంతిభాష్యంబుల కేఁ
జేసితి, డాసితిఁ, బ్రముఖుల
వీసము ముదమొదవ దీప్రవృత్తుల నెందున్.

పరమేశ్వరీ! నీయనుగ్రహము లేనివారి నందఱను వాగ్వావచతురులైన చదువరులుగఁ జేయుదువు. నీదయకుఁ బాత్రులగు సాధువులఁ బూజాసక్తుల నొనరింతువఁట. నీయంతరంగ మెఱింగి తెలుపఁగల మహనీయుల దర్శనము నాకెన్నండు కలుగునో! అట్టివారి కటాక్షము బహుజన్మలబ్ధ పుణ్యపరిపాకఫల మందురు. "అథవా విద్యయా విద్యా" అన్నట్లు నేను కొంద ఱాంగ్ల నారీమణులకు నాంధ్రగీర్వాణంబులఁ బాఠములఁ జెప్పుచు జాతివారలగోష్ఠినిఁ దిలకించితిని. వాఙ్మయప్రచారమును గావించు సుప్రసిద్ధ పాశ్చాత్యస్త్రీలఁ బరికించితిని. కేవల సన్న్యాసదీక్ష గ్రహించిన క్రైస్తవశ్రమణులఁ జూచితిని. పురుషవిద్వేషిణులై స్వచ్ఛందస్త్రైణోద్యమముఁ బ్రచురము గావించు నారీమణులఁ గాంచితిని. వారివారి పట్టుదలలతోఁ బెనఁగులాడుటయేకాని నిస్సంశయమైన ప్రశాంతి యొక్కరిచిత్తమందును గానరాదు.

నేటి మహిళామణులు కొందఱు తమకు సమ్యగ్దర్శన మేర్పడమిం జేసి చీకటింటఁ దడవికొన్నట్లు చేయు ప్రచారంబులు బహుభంగుల భంగపాటులకు మనస్తాపంబులకు నాకర మగుచున్నవి.

ఇంక గృహిణుల యాశాభయంబులు, శిశుపశుగృహచింతలును వర్ణనాతీతంబులగుట నాదారి నాకు నచ్చదయ్యె.

సులభ, మీరాబాయి, తరిగొండ వెంగమాంబ మొదలగువారిమార్గ మాధునిక కాలంబునఁ బ్రచారములో లేకుంట నయ్యది లోకసమ్మతంబై యుండదు. సత్యమైన దారినిఁ బోవుటకు లోకుల యంగీకారముతో నేమిపని? కాని లోకవాసన విహంగమార్గమునఁ దరింపఁ దలఁచు భక్తులకుఁ బ్రబలమైన శత్రువు సుమా!

క. లోకము దైత్యానీకము
నా కిలకఁ వలదు దాని నానుట, నఘముల్
సోఁకును, భవముల్ దాఁకును,
నీకృప లోచూపు నాకు నిలుపుము దేవీ!

లోకులు పలు పోకలఁబోవువారు. సాధువులుగ నుండుపురుషులనే బాధపెట్టుచుందురు. యోగినుల పాట్లు చెప్పవలయునా? హృదయగ్రంధి విప్పఁజాలనివిద్యలు- వినోదములు విత్తసాధనములు- మనఃక్షోభకరములు.

గీ. ఆత్మవస్తువు తెలిసినయట్టు లయ్యు
నైక్యపరములౌ వేదాంతవాక్యములను

గురుకరుణ నొందకయె యెంతకోవిదునకు
ననుభవార్థంబు గాఁజాల దంద్రు బుధులు.

ప్రాపంచికసుఖంబులు తాత్కాలికానందప్రదము లయ్యు దుఃఖపరిణామము లగుట నఖండానందప్రదమగు స్వస్వరూపానుసంధానసిద్ధి నొసంగు సద్గురుమూర్తిని సేవించుట పరమధర్మము, తల్లీ! నీదయ. నా కట్టిసద్గురుసన్నిధిఁ బ్రసాదించి కటాక్షించినచో జీవింతును. లేదేని యిదే నీపాదములపైనాన నిరశనవ్రతంబు పూని నీసన్నిధిఁ జేరెద నిది నిక్కువంబు.

(ప్రవేశము జ్ఞానాంబ.)

జ్ఞానా—(ఎదుటచూచి) అదిగో! నాపాలిటికల్పతరువు! (శారదను సమీపించి సాష్టాంగనమస్కారము గావించి)

తల్లీ! ఈదీనురాలిని గటాక్షించి పరతత్త్వము బోధించి తరింపఁజేయుము. దిక్కులేనిదానను. నీదయయే నా కాధారము.

గీ. కపటవృత్తినివృత్తినిఁ గాంచి తొలఁగ,
నాస్తికకులం బ దాకులం బంది కుంద,
దుష్టవనితలదౌష్ట్యంబు తొట్రుపడఁగ
భక్తురాలినిఁ జేసి తాపంబుఁ బాపు.

శారద—ఎవరీ సాధ్వీమణి? నాకేల యీపాపము గట్టెదవు?

ఆ. తాఁ దరించికాదె దాటించు నొరులను
దారకంబుకొఱకుఁ దాప మందు
నాకు మ్రొక్క నక్క! నీకేమి యిటఁ జిక్కు?
ఘనుని నొకనిఁ గొలిచి కనుమ శాంతి.

అమ్మా! నీ వెవ్వరో నన్నుఁజూచి కృతార్థురాల నని భ్రమపడుచున్నావు కాఁబోలు. నేనే సద్గురులాభమునకై నిరీక్షించుచున్నాను.

ఆ. దైన్యవృత్తిలేని ధర్మజీవన మొండు
మరణభీతిలేని మార్గ మొండు

తరుణి యెట్లు గలుగు? హరిపదాబ్జధ్యాన
పరతఁ గనక భక్తి గురుని గనక.

జ్ఞానా—
క. అమ్మా! దయ నాపై రా
నిమ్మా నీ సుతనుజుమ్మ! యిహపరసౌఖ్యం
బిమ్మా! నా దాస్యము గై
కొమ్మా భక్తులను నేలుకొమ్మా! యమ్మా!

నే నెవ్వరో యెఱుంగఁ గోరితివిగదా!
గీ. నన్ను జ్ఞానాంబ యందురు కన్నతల్లి!
పిన్ననాటనుబోలె సంప్రీతి మెఱయ
శివునిఁ బూజించుచుందు నీక్షేత్రమందుఁ
గోవెల నిడుప్రసాదంబుఁ గోరికొందు.

గత రాత్రియందు స్వప్నమున సోమేశ్వరుఁడు సాక్షాత్కరించి, చెంత శారద యుండ నీకేమి కొఱవ? అమ్మహానుభావ పినాకినీతీరంబున ధ్యాననిష్ఠయం దున్నది. నీవు నెంటనేపోయి యామె కాత్మార్పణం బొనర్చికొమ్మ. ధన్యురాల వయ్యెదవని యుత్తరువుఁజేసి యంతర్ధాన మయ్యెను. నీచరణమే శరణము. (అని పాదములపై వ్రాలి లేవకుండును)

శా—(స్వగతము) ఓహో! ఏమి యీదైవవిచిత్రము. జ్ఞానాంబ పరమభక్తురాలు నాకడ నబద్ధమేల యాడును? (ప్రకాశముగ) శివునాజ్ఞ నేనుమాత్రము దాఁటఁగలనా? నిన్ను నెయ్యంబునఁ జూచికొందును. ఈశ్వరానుగ్రహంబున నా కేమిలాభంబు గలుగు నదియే నీకును గలిగెడు లెమ్మ.

జ్ఞా—(లేచి) అమ్మా! శారద! నీకుఁ బరిచర్యచేసి తరించెద. నన్ననుగ్రహింపుము.

(ఆకాశముననుండి వినఁబడును)

తల్లీ శారదాదేవి!
క. జననం బాదిగ నివ్విధి
జననీ! సర్వార్థసారసంగ్రహ మరయన్

వని మునిజనములఁగనుఁ గొనఁ
జనుదెంచెదు నిన్నుఁబోలు సాధ్వులు గలరే?

శా—ఏమి! ఆకాశవాణియా! కాదు. ఎవరో యాకసమునసుండి భాషించుచున్నారు. (పైకిఁజూచి) ఓహో యెంతచక్కని హంస! ఈవాక్యంబు లీహంసరాజు పలికియుండును. ఏసిద్ధుఁడో నాపైవాత్సల్యమున హితముఁ గఱపవచ్చి యుండనోపు!!

గీ. స్వాగతము హంసరాజ! మద్భాగధేయ
మునకు నిశ్శ్రేణివై నీవు పొలిచి తౌర!
దారిఁ జూపింపుమయ్య! నా తారకమున
కవనిమీఁదికి వచ్చి మాటాడవయ్య!

హంస—(ఆకాశముననుండి దిగివచ్చును.)

హంస—తల్లులారా!

ఉ. మీరు మహానుభావలరమేయచరిత్రలు, భక్తరాంద్రొహో
ధాగణి మర్త్యులంచు నభిధానము మాత్రముగాక, సాటి యె
వ్వారును లేరు లేరనుచుఁ బండితపామరు లొక్కరీతిగాఁ
జేరి భజించుచుంట యది చెప్పకచెప్పదె మీప్రభావమున్.

గీ. నిన్ను సేవింపఁగల్గుట నేఁడు నిజము
జన్మసాఫల్యమును గంటి శారదాంబ!
నన్నుఁ జూచుచు నాజాడ నడచి రండు
ఉదయ మగుటకు మున్నె తత్పదముఁ జేర్తు.

శా—హంసరాజ!

గీ. భక్తవరుల కన్యోన్యవిశ్వాస మగుట
నమ్మి మీవెంట వత్తు. జన్మమ్ము సఫల
మొందఁజేసెడుసద్గురునొద్దఁ జేర్పు
మాప్తలక్షణ మదికాదె యార్తరక్ష.

అంబా! జగజ్జనని! నీకబూకు మెంతని వర్ణింతును.

శ్లో. పరాంబికాపాదసరోజసేవాం
నిరంతరం సత్కృతిభిః ప్రపూర్ణామ్
కరోతు, మత్పూర్వసు కర్మ సర్వం
గురూత్తమాంఘ్రిద్వయరూపమాశు.

(అని శ్లోకమునుఁ బాడుచు హంసవెంబడి జ్ఞానాంబతో నేగును.)

తెర వ్రాలును.

---

## ద్వితీయరంగము

జయంతము.

(వాకిట శారదాంబయు, జ్ఞానాంబయు నిలువఁబడియుందురు.)

శా—ఆహా! ఇయ్యాశ్రమారామ మెంత ప్రశాంతముగ నున్నది. (వినుటనటించి) ఓహో! బాలకులు ధ్యానశ్లోకములు చెప్పునట్లున్నది?

(తెరలో - భూపాలరాగము)

శ్లో. శాంతాయ సాధువరదాయ పరాత్పరాయ,
గోపాంగనాహృదయ పంకజభాస్కరాయ,
యోగీంద్ర వేద్యనటనాయ భవప్రియాయ,
ధర్మాయ ధర్మనియమాయ నమోనమస్తే.

ఉ. ఇంద్రియగోచరాత్ములు బుధేంద్రులు వారలఁగాంచలేని వీ
రందఱు వేదశాస్త్రముల నడ్డముదిడ్డము చేసి శంకలన్
డెందము కుందకుండఁ బలు తేవలడాఁగిన బ్రహ్మతేజ మా
నంద మతీంద్రియం బది కనంగలరన్న వృథాభిమానమా.

క. సకలము బ్రహ్మంబనితా
నకలంకస్థితిని గురుకటాక్షముకలిమిన్
ద్రికరణముల సరి గొల్చినఁ
బ్రకటించున్ దత్త్వ మంబ పరమప్రీతిన్.

శా——(పద్యములను విని వెనుకకుఁ దిరిగి చూచుసరికి హంసయదృశ్యమగును) హంసరాజేఁడీ! అదృశ్యుఁ డయ్యెను. ఏమి యీ చిత్రము! నాకిక్కడ దారిఁజూపువా రెవ్వరు? సూర్యభగవానులే నాకు దిక్కు!

క. వేవిధములఁ దలచూపెడు
జీవులతమముల్ హరించి సిద్ధులఁ జేయం
గావలయు వేయికరముల
తో వచ్చెదు నిత్య మీవు తోయజమిత్రా!

(ప్రవేశము : బాలకుఁడు)

వటుఁడు——(వచ్చి నమస్కరించి) అమ్మా! శారదాదేవీ! మిమ్ము లోనికిఁ దోడ్కొనిరమ్మని నాకు శ్రీపరమహంసమునీంద్రు లాజ్ఞాపించినారు.

శా——అమ్మహనీయునిదర్శనమే మాకభ్యర్థనీయము. (స్వగతము) హంసరాజు నుడివిన దేశికోత్తముఁ డీతఁడే. సందియము లేదు. నేటికి నాతపము ఫలించినది. (అని వటునితో నిష్క్రమించును)

(గోష్ఠీమండపము)

(పరమహంస వ్యాఘ్రాసనమున నాసీనుఁడై యుండును.)

పరమ——ఆనందః ఆనందః ఆనందో బ్రహ్మ బ్రహ్మానందః.

రాజ——(పట్టుబట్టల ధరించి పుష్పములు చేతఁబూని వచ్చుచు)

మాలిని.——

మన మది గురుసూక్తిన్ మాధవాత్యంతభక్తిన్
ఘనతరజపశక్తిన్, జ్ఞానయోగప్రసక్తిన్,
గనియెఁ గదవిరక్తిన్, గర్మసంసారముక్తిన్
మను విఁక నెటులున్నన్ బావనం బెందుఁగన్నన్.

(అని పరమహంసకు నమస్కరించును.)

పర——రాజశేఖరా! ఈశారదాగమనము మనకెంతయు సానందసంధాయకము.

(ప్రవేశము ధర్మాంబ, ఆమెవెంట శారద, జ్ఞానాంబ ప్రవేశింతురు.)

(పరమహంసకు నందఱు నమస్కరింతురు. పరమహంసయందఱను దీవించును.)

ప—(రాజశేఖరునితో) నిన్న నీతోఁ బ్రశంసించినదీ వనితామణినిగుఱించియే సుమా!

శా. బాలత్వం బని యౌవనం బనియుఁ జెప్పన్ రాక శ్రీవిష్ణుసే
వాలోలత్వము పుట్టుతోడ గలిగెన్ బ్రాహ్మీప్రసాదంబునన్
బాలోన్మత్తపిశాచవర్తనమునన్ బ్రహ్మాత్మబుద్ధిప్రభన్
భూలోకోద్ధరణైకసత్క్రియకునై పూర్ణాత్మకల్యాణమా
లీలామానుషవిగ్రహంబు నిటుదాల్చెన్ జూడుమా! యోగినిన్.

రా—స్వామీ! ఈశారదజన్మము కలికల్మషహరంబు.

ఉ. ఇమ్మహనీయురాలి కెనయే జగమందున కాంతలెందు? లో
కమ్ము తృణమ్ముగా నరచి యిటు కాననసీమల జ్ఞానలబ్ధికై
ముమ్మరమైన యార్తిఁబడి పుణ్యఫలమ్ము భవత్పదమ్ము జ
న్మమ్ముఁ దరింపఁబట్టి మునిమాన్య పవిత్రపదంబుఁ జేకొనెన్.

శా—(స్వగతము)

క. భగవద్భక్తులవలె నీ
వుగదా దర్శనము నిత్తువో పరమేశా!
జగమున భేదం బించుక
యగపడకుండంగఁ జేయుమా! యిరువురకున్.

(పరమహంసను సమీపించి యంజలిఘటించి) (ప్రకాశము)

ద్విపద — భూపాలరాగమునఁ బాటగఁ బాడవచ్చును.

యోగీశ్వరా భూసురోత్తమ ధీర!
ఆగమేతరదూర ఆనందసార!
శ్రీగురుస్వామి! యాశ్రితభక్తకామి!
జేగీయమాన! ప్రశిష్య సంతాన!
విశ్వసన్మాన్య! సద్విబుధాగ్రగణ్య!
ఐశ్వర్యధన్య! వేదాంతిమూర్ధన్య!

నిరుపాధికుండవై నిర్విచారముగఁ
బరమార్థదృష్టి ధావనము తీవ్రగతిఁ
జేయుచుండెడినీకు జేయొనర్చుచును
న్యాయంబుగా జీవయాత్ర నడిపెదము.

(అని పువ్వులు మునిపాదములపైఁజల్లి నమస్కరించును)

మ. పరులన్ వేఁడుటకన్న వేఱుకలదా పాపంబు? సద్భక్తులన్
హరినిన్ బాడుటకన్న నొండుకలదా యానందముద్యోగమున్?
గురుసూక్తిన్ భజియింపుచున్, బుధులతో గోష్ఠివినోదంబులన్
దరియింపంగల పుణ్యపూరుషులచెంతన్ దాసినిన్ ధన్యనున్.

స్వామీ! సర్వజ్ఞులును, సర్వశక్తిమంతులు నగు మీరే నాయంతరంగ మెఱింగి మీసన్నిధికి రప్పించుకొనిరి. సర్వమునకు మీరే కర్తలు. నేఁడు మీదర్శనము లభింపకున్నచో నేనేమయియుండెడుదాననోకదా. నామదికి జీవితము భరింపరాని దైనది.

ప—తల్లీ! దిగులొందకుము. శ్రీహరి నిన్నుఁ బరిపూర్ణముగ ననుగ్రహించియేయున్నాఁడు. అంత దుర్భరమైనవేదన కలుగుటయే తద్బాధాపరిహారమునకు దృఢమైన సూచన.

మ. ఘోరస్వప్నము గాంచి జీవుఁడటు మేల్కాన్నట్టు లజ్ఞుండుతా
ఘోరాఘంబుల సల్పిసల్పిమది సంకోచంబులన్ వీడ స
ద్వైరాగ్యంబున బ్రహ్మమట్లుచలుఁడై స్వస్వామిసద్యోగ వి
ద్యారామత్వము తత్త్వమై తనర నాత్మార్థంబు వర్ధిల్లెడున్.

స్వప్నమున యథార్థముగ ననుభవించుచున్నటు లున్నను జాగ్రదవస్థనుఁబట్టి కలకలగా గ్రహించినట్లు, పరమార్థదృష్టిఁజూచిన, నీప్రపంచమునందలి యనుభవములును గలగాఁ దోఁచును. జగమంతయు మిథ్యకదా! యందు గురుండును గురుబోధంబు మాత్రము మిథ్యకాదా! యందురు, జగముతోఁబాటు గురుఁడుకూడ మిథ్యయయ్యుఁ దద్బోధము మాత్రము ప్రబోధంబొసంగఁ జాలియుండు నదియెట్లన్నఁ, గుమారుఁడు బావిలోఁబడినట్లు కలఁగాంచి భయమొందుచున్నవానికి, బావియుఁ గుమారుఁడందుఁబడుటయుఁ బడినపుడు కలిగినశబ్దమును, గల్లయైనను, శబ్దము మాత్రము మెలకువను గలిగించి, కలఁతఁబాపఁ జాలి యుండును.

గురుబోధము శ్రవణమాత్రంబున జగజ్జీవేశ్వర భ్రాంతిని దొలఁగించి పరమానంద మొసంగును. కావున శ్రద్ధాభక్తులతోఁ దత్త్వము నెఱింగి కృతార్థురాల వగుము.

ఉ. ఎట్టి మనోవికార ముదయించిన నయ్యది జీవసంజ్ఞగా
నెట్టుము సద్గురూక్త విధి నేర్పున శౌరిపదద్వయంబునే
పట్టుము భక్తకోటికిఁ బ్రపత్తి నొనర్పుము మోక్ష మద్ది నీ
పట్టగు వేదచోదితము భవ్యపథం బిది శారదామణీ.

స్వస్వరూపసాక్షాత్కారదీక్ష నిపుడే పొందఁగలవు. నిన్ననుసరించివచ్చిన జ్ఞానాంబయుఁ గృతార్థురాలు కాఁగలదు. ధర్మాంబా! నీపుత్రుఁడు లోకపవిత్రుఁ డయ్యెను. ప్రతికాలాభసంతోషమ మీశారదాంబ నీకొసంగఁగలదు.

ఉ. కూఁతురటంచు లోకములకుం దలమానికమంచువిద్యలం
ఖ్యాతివహించెనంచుఁ బరమార్థపు సారమటంచుమాతగాఁ
బ్రీతిని సాకుచుండఁ గల పెద్దరికం బొనఁగూర్చునీకటం
చాతత వైభవోన్నతుల నక్కునఁ జేర్చి ముకుందగీతికా
వ్రాతము పాడి వించి భవవార్ధిఁ దరింపుము బాలతో లలిన్.

నీకుమార్తెను లోనికిఁ గొనిపోయి మంగళస్నానముఁ గావించి జపశాలలోనికిఁ దీసికొనిరమ్మ.

ధర్మా — మహాప్రసాదము. (శారదవైపునకుఁ దిరిగి) తల్లీ! శారదా!

క. కనిపెంచనికూఁతురవై
కనిపించితి మానికృపనికం దల్లి నినుం
జనవునరయుము మనమున
వనితామణి నాదుపుణ్య ఫలమీవుసుమీ.

పరమ — తల్లీ! శారద! ఈధర్మాంబ రాజర్షి యనం బ్రసిద్ధుఁడగు నీరాజశేఖర మహారాజుసహధర్మచారిణి, నిరంజనమహీపాలునకు జనయిత్రి, నీయందుఁ బుత్రికావాత్సల్యము కలది. ఈయాశ్రమమున నీకీమె తల్లి కాఁగలదు.

శా — మహాప్రసాదము.

ధ — సెలవు పుచ్చుకొనుము, లోని కేగుదము.

శా—(నమస్కరింతురు.)

జ్ఞా—సెలవో సంగుఁడు, పోయివచ్చెదము.

(తెరవ్రాలును.)

---

# తృతీయరంగము

## కన్యాకుమారి.

నశ్రేళ—ఒరే సుబ్బుశెట్టీ! ఏమిరా! ఈవేళ నీకుదంశిగ దక్షిణముట్టినదా యేమి?

సుబ్బు—నీకేమి నిరంజనమహారాజుగారికి స్నానసంకల్పము చెప్పి వడినింపుకొంటివి. కావున నందఱను వేళాకోళము చేయుచున్నావు?

న—నీకేమిచేటురా! ఆలాగు మాఱిమాఱెదు చేసికొని వచ్చుచున్నావు? ఆ రెండుమోటారులలో వచ్చినయతఁడు నీకేమియు నీయలేదా?

సు—ఆయన పట్టులాగు, కోటు బంగారుగుండీలు, చేతికఱ్ఱ యాజాతిదొరవేషము, వైదికముగనుండు తల్లిదండ్రులనుఁ జూచి, యీయన యేమండలాధిపతియో, యేమంత్రియో నాపంటపండినదని యాతనిసే మాపెట్టుకొని యుండఁగా నానోట మంటిగడ్డకొట్టినాఁడు.

న—ఏమిరా! వాఁడేమి చేసినాఁడు?

సు—ఆయనకేమి పిచ్చియో! ఏదేనిదయ్యము పట్టినదో! నేను జూచుచుండఁగా లాగు చొక్కా మొదలగువాని నన్నింటినిఁ దీసి నిర్విచారముగ సముద్రములోఁ బాఱవైచి, మీసముకత్తిరి-పుజుట్టు గొరిగించుకొని, వైదికపువానివలెఁ బిలకజుట్టు పెట్టుకొన్నాఁడు. నాకును నాళతెగక యిదంతయు వైదికశ్రద్ధగాఁబోలు, నాకు నేదోముట్టునని నిరీక్షించుచుండ, లోనికిఁబోయి బిళ్లగోచీ పెట్టిదోవతికట్టి విభూతిపెండెకట్లు తీర్చి, యొకజోలెకట్టి ముష్టికి బయలుదేరినాఁడు. అప్పటికిఁ గుక్కాశపండ్రాతితోఁ దీరినది. నా లాభమునకేమి గాని, యావేషముమార్చి యీవేషమేల దాల్చెనో నాకుఁ దెలియదు. కాల్చుచుండు కంపెనీచుట్ట తీసి పారవేసిననోట స్వచ్ఛమైనపాటలు, పద్యములు, నామస్మరణము చేయుచుఁజేయు భిక్షాటన మాబాలగోపాలముగుంపులు కట్టి చూచుచున్నారు. ఆయన తొల్లింటివేషము నందఱు చూచినవారగుట నీమార్పున కచ్చెరువందుచున్నారు. (వినుట నటించి) అదుగో! ఆమహానుభావుఁడిటే వచ్చుచున్నాఁడు.

(ప్రవేశము అన్నంభట్టు)

అన్నం—భవతి భిక్షాం దేహి.

సీ. రామామృతమునోటఁ ద్రావఁగల్గిననాఁడు
నిల మఱొక్కఁడు రుచియించు నెట్లు
కృష్ణకథల్ చెవి కింపుగావిననాఁడు
వినిపించునే మఱి వింతలెందు
బ్రహ్మవిద్యాలబ్ధి పరిఢవిల్లిననాఁడు
నరుగునే సభ కుపన్యాసములకు
సద్గురూపాస్తిచే శాంతిగల్గిననాఁడు
తర్కమంత్రంబులఁ దగులుకొనునె
గీ. ముక్తియందేని మోహంబు పుట్టదన్నఁ
జీటికిని మాటికెట్లొకో చేరనేర్చు
నితరనిషయంబులను మానసేంద్రియముల
యనుభవములేక చర్చించు టదియ కాక.

భవతి భిక్షాం దేహి.

(ప్రవేశము : డామాడోలీ యొకప్రక్కనుండియు, రామిరెడ్డి మఱియొక ప్రక్కనుండియుఁ బ్రవేశింతురు.)

డామా—ఆయనా! తెలుఁగువానివలె నున్నావు?

మీరా! రామిరెడ్డిగారా! మన తెలుఁగువారెనిఁజూచిన నీయఱవవారికెంత యలుసము కొన్నారు! దారియడిగినఁ జెప్పరుకద! వారికిఁ దెలిసిన విషయ మడిగినను మన ముఖము చూడఁగానే తెలియదని కొందఱును, "నేరుగా పూడ్చండి" అని మఱికొందఱు నందురు. ఎవరిని బూడ్చుట? వారినా? నన్నా? మామహారాజుగారికిఁ గ్రొత్తగాఁ బెండ్లియాడిన భార్యమీఁదకన్న నన్నంభట్టుమీఁద మరులెక్కువైనవి. భట్టుగా రెక్కడ నున్నదియు వెదకి కనుఁగొని పిలిచికొని రమ్మని నాకాజ్ఞాపించినారు. నాయనా రాజవీధికి దారిదేనా?

రామి—ఔనిదియే పొండు (డామాడోలీ నిష్క్రమించును.)

రామి—(స్వగతము) ఎవ రీతఁడు. ఎఱిఁగినవాఁడే, ఆనవాలు తెలియ లేదు.

(మరల ప్రవేశము : అన్నంభట్టు)

అన్నం—

శా. ధ్వంసంబుం బొనరించి మించుటకు నీద్వంద్వంబులన్ లీలమై
సంసారం బెదనమ్మ కించుకభవత్సాయుజ్యమేయంచు నో
కంసారీ! భవదీయభక్తతతితోఁ గాలంబు నిశ్చింతగా
హంసోపాసనఁజేయుచున్ గడచెదన్ న్యాయ్యంబె కానీకృపన్.

భవతి భిక్షాం దేహి!!

రామి—(పరికించి చూచి)

ఓహో! ఎవరీబ్రాహ్మణుఁడు? నాస్నేహితుఁడు భట్టువలెనున్నాఁడు. అతఁ డిట్టులౌటయెట్లు? అరే! అతఁడే! (సమీపించి) భట్టుగారా?

భట్టు—అవును. నన్నన్నంభట్టందురు. (ముందునకు సాగి)

ఉ. మాటలణంగు ధ్యానమహిమంబుచెలంగు మనోవికారముల్
మాటికిఁగ్రుంగుఁ, జేష్ట లభిమానముతోడఁ దొలంగు, నాత్మ ము
మ్మాటికిఁ బొంగు జ్ఞాన మణుమాత్రము గల్గినయేని యందురా
వాటము దేశికోక్తుల నపారకృపన్ వినిపింతు మాధవా!

రామి—అన్నంభట్టుగారూ! ఒక్కమాట, పదిదినములక్రిందటఁగదా మీరు యూరపునుండి వచ్చినందులకు మేమందఱము చెన్నపురిలో మీకు స్వాగతపత్రము నిచ్చితిమి. మొన్నటిదినపత్రికలో నన్నంభట్టుగారు కల్యాణపురసంస్థానమునకు మంత్రిఁగా నియమింపబడిరనియుఁ బూర్వపుఁ బ్రధానిసుదర్శనులు కొలఁదికాలములోఁ దపంబున కేగుచున్నారనియుఁ జదివితిమి. ఏమి యీయాశ్చర్యము? ఇంతలో నింత మార్పేల? మనోహరమైన మీవేషమునుమార్చి యీవికారపు బిచ్చపు బాపని యాకృతి ధరించితిరేమి? మీ రింతసాహసముచేయుదురని కలనైన ననుకొన లేదు.

అన్నం—మీకింతవింత యేల? భరతఖండములోని యార్యవిజ్ఞానహృదయము మహానుభావులవలన నెఱిఁగితిని. కాన నాయహంకార పరిత్యాగమునకై యిట్లు జేయు చున్నా నీ భిక్షాటనము.

